యువభారతి ప్రచురణ

సాహితీ వాహిని పరంపర

# వడగళ్ళు

రావూరు

తలపుల జల్లు

# వడగళ్ళు

కృష్ణాపత్రికలో అక్షరరూపం దాల్చి
అశేషజనుల నుర్రూతలూగించిన
రసమయ వ్యాఖ్యానాలు

రచయిత :

రావూరు వెంకటసత్యనారాయణరావు

ప్రచురణ :

యువభారతి

యువభారతి

సాహితీసాంస్కృతికసంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

VADAGALLU
SKETCHES OF HAILY HILARTIY
BY SRI RAVURU VENKATASATYANARAYANA RAO



యువభారతి

ప్రచురణ : 22

ప్రథమ ముద్రణ : 5,200

జూలై 19, 1974

ముఖపత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్,
బషీర్ బాగ్, హైదరాబాద్-500029.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు-500003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500001.

వెల : రు 2-00

సాహితీమిత్రులకు
రూపాయిన్నర మాత్రమే

# ఒకజల్లు

ప్రాచీన సాహిత్యంలోనూ, ఆధునిక సాహిత్యంలోనూ తెలుగు ప్రజానీకాన్ని ఆకర్షించిన, అలరించిన, ఉత్తేజపరచిన రచనల స్వరూప స్వభావాలను సంగ్రహ రూపంలో పఠితలకందించే ప్రయోజనంతో మా యువభారతి సాహితీవాహిని ప్రచురణ పరంపరను కొనసాగిస్తున్నది. ఇప్పుడీ 'వడగళ్లు' ఆధునిక వచన రచనకు సంబంధించిన ప్రచురణ. ఇది దీని ప్రత్యేకత.

తెలుగులో వ్యాసప్రక్రియ వివిధ శాఖల్లో విస్తరించింది. సాంఘిక సంస్కారణానికీ, సాహిత్య విమర్శకూ, తాత్త్విక చింతనకూ, సహృదయ హృదయోల్లాసానికీ వ్యాసం వివిధ రూపాంతరాలతో విరాడ్రూపం తాల్చింది. వ్యాస ప్రక్రియ వ్యాప్తి చెందటంలో తెలుగు పత్రికల పాత్ర అనల్పం. పత్రికాముఖంగా వ్యాసం ప్రజల్లో ఊపిరి నింపుకుంటున్నది.

తెలుగు కావ్యాల్లో లాగానే వ్యాసాల్లో కూడా హాస్యాన్ని రంగరించి రచనం సాగించిన రచయితలు తక్కువ మందేకనపడతారు. శ్రీ రావూరు వెంకటసత్యనారాయణ రావుగారు తెలుగువ్యాసాన్ని సున్నితమైన హాస్యంతో సుందరతరం చేసి పఠిత హృదయాలకు సూటిగా చేరి సొగసుగా ఆకట్టుకొనేటట్లు చేశారు. సహృదయ హృదయోల్లాసానికి కావలసిన శైలీ విన్యాసాన్ని తమ రచనల్లో లాస్యం చేయించారు. వీరివ్యాసం ప్రధానంగా సమీక్షాత్మకం. దానికి క్షేత్రం సమాజం. సూత్రం పత్రికారచనం. స్వభావం వీరి కథనాత్మకం, వాఙ్మయచరిత్ర రూపపరికల్పనం, ప్రాణం హాస్యం. సమకాలీన సమస్యల్ని సరస వినోదంగా సామాజికుల కందించటం లక్ష్యం. ఈ వ్యాసాల వడగళ్ళవాన ఇప్పటిదికాదు. ఇరవై అయిదేండ్లకు పూర్వంకురిసింది కృష్ణాపత్రిక వ్యాసతరంగాల మీద. అనాడెంత ఆంధ్రావళిని ఆనందింప చేసిందో నేడూ అంత ఆమోదింపచేస్తున్నది. వడగళ్ళ జడివానలో ఒకజల్లు ఈ యువభారతి ప్రచురణం.

కవిగా, వ్యాసకర్తగా, పాత్రికేయులుగా తెలుగులోకానికి సుపరిచితులు శ్రీ రావూరు సత్యనారాయణరావుగారు. ఆయన్ని పరిచయం చేయటం జగమెరిగిన బాపని జందెం చూపటం. వారు రచనా వ్యాపంగం ప్రారంభించి ఏభైఏళ్ళయింది. వారి సాహిత్య జీవితానికి ఈ యేడు స్వర్ణోత్సవం. ఆ సందర్భంగా యువభారతి అర్పిస్తున్న అక్షరోపాయనం ఈ ప్రచురణం. మాకీప్రచురణకు అవకాశాన్ని దయతో కల్పించిన శ్రీ రావూరు వారికి యువభారతి కృతజ్ఞతాభివందనాలు.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకులు, యువభారతి ప్రచురణలు.

# వడగళ్ల చరిత్ర

కొంచెం బుద్ధి తెలిసినప్పటినుంచీ నాలో ఒక కోరిక వుండేది. 'నేను రచయితను కావాలి' అనేదే ఆ కోరిక. మా ఇంట్లోవాళ్ళూ, బంధువులూ-ఏవేవో ఉద్యోగాల పేర్లు చెప్పి వాటిల్లో ఒకటి నే చేస్తానని ఉవ్విళ్ళూరేవాళ్లు. ఎవరేమి అనుకొన్నా నా మనస్సులో 'రచయితను కావాలి' అనే భావమే వెన్నెల వలయంగా తిరుగుతూ వుండేది. ఆశయాలు అటువైపు కొద్దికొద్దిగా జరుగుతూ వుండేవి.

నా కోరిక కొన్నాళ్ళకు పూలగుత్తులు తొడిగింది. 1938లో నేను కృష్ణాపత్రిక సంపాదక వర్గంలో చేరాను. రచనలో వివిధ ప్రక్రియలూ సాధించడానికి తగినంత అవకాశం లభించింది. సంపాదకులు శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు కల్పించిన స్వేచ్ఛ కలానికి గజ్జెలు కట్టి గంతులు నేర్పింది.

కృష్ణాపత్రికతో "సాహిత్యం-మీమాంస", "నాటకం-నృత్యం", "శిల్పం-చిత్ర రచన" ఇత్యాది శీర్షికలు వుండేవి-వీటితోపాటు "వింతలు-విశేషాలు" అనే శీర్షికకూడా వుండేది. దినపత్రికలలో వచ్చే కొన్ని ప్రత్యేక వార్తలు సేకరించి నేనా పుట నింపుతూవుండేవాణ్ణి. తర్వాత అనిపించింది-ఆ వింతవార్తల్లో కొంత స్వంత వ్యాఖ్య కూడా కలిపి వ్రాస్తేబాగుంటుందని. అలా కొద్దివారాలు వ్రాశాను. పాఠకులలో కొంత ఆశక్తి కలిగించిందాపుట. క్రమంగా ప్రత్యేకత కూడా కల్పించుకొంది-అందువల్ల శీర్షికకూడా మారిస్తే బాగుండుననిపించింది. ఆలోచించి 'వడగళ్ళు' అని నామకరణం చేశాను. ప్రారంభించిన ముహూర్తంవల్లా, మా గురుదేవులు కృష్ణారావుగారి ఆశీర్వాదంవల్లా ఆ శీర్షిక సుమారు పద్నాలుగు సంవత్సరాలు గడిచింది. నేను కృష్ణాపత్రికలో నుంచి విరమించుకొన్న తర్వాత-పత్రిక ఇతర ప్రముఖుల చేతిలో ఉన్నప్పుడుకూడా-కొంతకాలం వ్రాయడం జరిగింది.

కృష్ణాపత్రికలో శీర్షిక ప్రారంభించగానే సంపాదకులు-అప్పటి యువ చిత్రకారుడు శ్రీ తోట వెంకటేశ్వరరావు చేత బొమ్మ వేయించి బ్లాకు చేయించారు. కొద్ది రోజులతర్వాత వేరువేరు విషయాలు సేకరించి వ్రాయడం కన్న-వారానికి ఏదో ఒక్క విషయమే తీసుకొని అపై వ్యాసం రూపంగా నిలిచే అవకాశాలున్నాయనిపించింది. కొంత హాస్యం, వ్యంగ్యం కూడా జత కలిపితే-వింతా, వినోదం రెండూ కలసి వస్తాయనే భావం కలిగింది.

ఒకే విషయం మీద వ్యాసం వ్రాయడమనేది శ్రీ చెళ్ళపిళ్ళ-శ్రీ శ్రీపాద కవుల అభిప్రాయ భేదాలకు సంబంధించిన వార్తమీద ఆధారపడి చేసినవ్యాఖ్య-అయితే యిందులో వింతా వినోదం కన్న వ్యాఖ్య ఎక్కువైంది. ఇలాటి కాలక్షేపం శీర్షికలు వ్యక్తులపరంగా వ్రాయడం-అందులో వారి ప్రతిభనూ, పాండిత్యాన్ని పురస్కరించు

కొని వ్రాయడం సమంజసం కాదనిపించింది. అయితే ఈ మొదటివ్యాసం సంపాద కీయం వున్న పేజీలో అచ్చయింది. అందువల్ల కృష్ణారావుగారే వ్రాశారన్న భావం కలిగిందందరికీ-వ్యాసం కొంచెం వెంకటశాస్త్రుర్లవారికి అనుకూలంగా వుండటంవల్ల వారి వద్దనుంచి సంపాదకుల్ని శ్లాఘిస్తూ ఉత్తరం కూడా వచ్చింది. కృష్ణారావుగారా ఉత్తరం చదివి-"మీరిక పేరుపెట్టి వ్రాయండి. లేకపోతే యిలాగే నేను మీ 'పేరు' కొట్టి వేయవలసి వస్తుంది" అన్నారు. నేను వ్యాసాలకు ఎప్పుడూ పేరు పెట్టలేదు.

వ్యాసాలకు పేరుపెట్టడంవల్ల దగ్గిరవారికి ఏ కొద్దిమందికో తప్ప నేను వ్రాస్తున్నానని తెలియదు. ఆయా వ్యాసాలను బట్టి కొందరు కృష్ణారావుగారనీ, కొందరు మునిమాణిక్యంగారనీ, కొందరు కాటూరి మాస్టరుగారనీ భావిస్తూ వుండేవారు. హాస్య భాషణలో, రచనలో ప్రసిద్ధికెక్కిన శ్రీ చెరుకువాడ నరసింహంగారని కూడా కొందరు భావించి ఉత్తరాలు వ్రాస్తూ వుండేవారు. ఒకసారి రుక్మిణీశాస్త్రిగారు అన్నారు - "నువ్వు 'వడగళ్ళు' పేరుపెట్టి వ్రాయి - లేకపోతే నేనుకూడా కొంత అప్రతిష్ఠ మోయవలసి వస్తోంది"అని. "అందరితోపాటే మీరుకూడా భరించాలి. ఎంత అప్రతిష్ఠ అయినా ఏంచేస్తాం!" అన్నాను. "అవునండీ ఒకరిపేరు ఒకరు కాజెయ్యడం అప్రతిష్ఠకదూ! ఎప్పుడో నేనే వ్రాసివేస్తా-వడగళ్ళు వ్రాసేది ఫలానా ఆసామి-వాటి తాలూకు గౌరవంతో మాకెంతమాత్రం సంబంధంలేదు" అని అన్నారు.

కృష్ణాపత్రిక ప్రతి శనివారం విడుదల అయ్యేది. కాపీలు శుక్రవారం సాయంత్రానికి తయారయ్యేవి. ఆ రోజు దర్బారులో-దర్బారు షాయరు - శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు వడగళ్ళు చదవాలి, అందరూ విని ఆనందించాలి. ఆయనగారలా చదివేదాకా కాపీలు ఇతరులకు అందనిచ్చేవారు కాదు-కృష్ణారావుగారి ముసిముసి నవ్వులు తిలకిస్తూ నేనొకమూల వొదిగివుండేవాణ్ణి.

సోమవారం పత్రికలో వ్యాసాలు అచ్చుకావడం ప్రారంభించినప్పటినుంచీ "ఏమిటీవారం?" అని మిత్రులు ప్రశ్నించడం, ఆ ప్రశ్నలనుంచి మథన బయలుదేరడం-దానిలోనుంచి వస్తువు అందడం జరుగుతూ వుండేది. విషయ సేకరణకు తంటాలు పడటం అంటూ వుండేదికాదు. ఒక్కొక్కప్పుడు ఆ వారంలో రాజకీయాలు-చక్కని-వస్తువునందిచ్చేవి. ఒక్కొక్కప్పుడు అవకతవక ఉపన్యాసాలు అందమైన వ్యాసానికి దోహదమిచ్చేవి. మారుతున్న సాంఘికాచారాలు, నవలోకం కోరుకునే మార్పులు. మతిమరుపు వ్యక్తుల విచిత్ర గాథలు, రాజకీయాలలో రగడలు, సంస్థలలో చెలరేగే దుమారాలు, కవుల కలాలు చిలికే మీగడ తరకలు-ఇవన్నీ మధ్యమధ్య నాకు లభిస్తూవుండేవి. స్వతంత్రంగా ఆలోచించి గ్రుచ్చుకొంటున్న మాటలలో పైన చెప్పినవి-తాత్కాలికంగా విని చివరికి పోయేవైనా - ఆ సమయంలో తళుకులు గ్రుమ్మరించేవి.

వడగళ్లు పేరు తలుచుకొన్నప్పుడు స్వర్గీయ మల్లినాధసూరి జ్ఞాపకంరాకతప్పదు. చాలా వ్యాసాలకు మేటరు అందించిందా మహానుభావుడే! ఆయన కృష్ణాపత్రికకు సెపిష్టుగా వుండేవారు. అదికాక తపైడు చాకిరీ చేసేవారు. పైకి వట్టి అమాయకుడు. లోపల ఎంతో హాస్యం. వడగళ్లు ఆరంభించిన తరువాత....ప్రతిరోజు ఆయనతో కొంతసేపు కలిసి తిరగడం నియమంగా పెట్టుకున్నాను. ఆయనలోగల హాస్యపు పాళ్లు వడగళ్ళలో మెఱుపు రాళ్లుగా నిలిచి పోయినాయి. ఆయనపేరు వడగళ్లలో అనేక మాట్లు పేర్కొనబడింది. కడగళ్ళను, కన్నీటిధారలను తుడిచివేసుకొని మేమిద్దరం ఎంతో సంతోషంగా ఎంతోకాలం వడగళ్ళవానలో వానావల్లప్పలు తిరిగాం. ఆయన చాలాకాలం క్రిందనే నన్ను కన్నీటి జడివానలో త్రోసి కనుమరుగైపోయారు.

వడగళ్ళలో మల్లినాధుల వింత అనుభవాలు, విచిత్ర వ్యాఖ్యలు కొన్నిటిని యధాతథంగా చిత్రించాను. అలాటివి దొరకనప్పుడు కొన్ని సంఘటనలను, పాటలను సృష్టించి ఆయన గారన్నట్టుగా వ్రాసి పాడినట్టుగా పేర్కొన్నాను. వడగళ్ళకు సంబంధించినంతవరకూ—మేమిద్దరం ఒకటిగా నిలవవలిగాం....ఎంటరితనం భరించలేకపోయాం.

నేను వడగళ్లు ప్రారంభించడానికి ముందే చాలామంది ప్రముఖులు వివిధ పత్రికల ప్రత్యేక శీర్షికలు నిర్వహిస్తూ వచ్చారు. ఆంధ్రపత్రికలో శ్రీ దాసు వామనరావు గారి 'కాలక్షేపం', ఆంధ్రప్రభలో కీర్తిశేషులు న్యాపతి నారాయణమూర్తిగారి "పాన్ సుపారీ", శ్రీ నార్లవారి "మాటా-మంతీ" వంటి శీర్షికలు వెలువడినాయి. ఇలాటి శీర్షికలు మరికొన్ని కూడా వుంటాయి. కృష్ణాపత్రికలో స్వర్గీయ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు - "చలువమిరియాలు" అనే పేరుతో చక్కటి చెణుకులు వ్రాశారు. వీరి అందరి రచనా శిల్పం నాలో స్వల్పంగా వున్న రచనా కౌతూహలంతో రంగరించుకోగలిగానేమో ననిపిస్తోంది. కాని ఎవరిపోకడలు వారివే!

చిన్నతనంలో నా ధ్యేయమంతా కవిత్వంమీదనే వుండేది. ఆ దారిలో చాలా దూరం పరుగులు తీశాను. ఏవో నురుగు గజల చప్పుళ్ళు వినిపిస్తూ వచ్చాయి కృష్ణాపత్రికలో మొదటగా ప్రచురించిందికూడా గేయమే! మనస్సు హాస్యంవైపు ఎప్పుడు మళ్ళిందో ఎలా మళ్ళిందో స్పష్టంగా తెలియదు. ఆనాడు బందరులో 'నవ్వులరాణి' అనే ఒక పత్రికవుండేది 'బ్రహ్మదేవుడికి పిటిషన్' అనే పేరుతో ఒక హాస్యరస వ్యాసం వ్రాశాను. వారది ప్రచురించి, రెండురూపాయలు పారితోషకం పంపారు. అదే హాస్య రచనకూ సంపాదనకూ నాంది. అప్పటినుంచీ వడగళ్లుదాకా నాలో హాస్యం, మూగవీణగాపడివుంది. కృష్ణాపత్రిక శ్రుతులు సరిచేసి పాడడం నేర్పింది.

వడగళ్లు నడుపుతున్న కాలంలో చాలా 'వస్తువులు' మనస్సులో మెదులుతూ వుండేవి. వారానికి ఒకటి చొప్పున ఎంతకాలానికో సరిపడ్డ భావాలు కుప్పలు పడి

వుండేవి. ఆ సమయంలో శ్రీ ఉప్పులూరి కాళిదాసుగారు తమ వారపత్రిక 'ఆనంద వాణి'లో ఒక శీర్షిక నడుపవలసిందిగా కోరారు. 'కప్పుకాఫీ' అనే పేరుతో చాలా కాలం ఆ శీర్షిక కొనసాగించగలిగాను. ప్రతివారం రెండువ్యాసాలు వ్రాసేవాణ్ణి. 'ఏది ఏ పత్రికలోకి?' అన్న విషయంమీదనే కొంచెం ఆలోచన జరిగేది. తరహానుబట్టి వాటిని పురమాయిస్తూ వుండేవాడిని.

ఈ శీర్షిక ప్రారంభించిన తర్వాత నాలో కొంత పరిశీలనాశక్తి-దానితోపాటు భావనాబలం ఏర్పడింది. వాటికితోడుగా ఒక శైలి అలవడింది. సాహిత్యపరంగా ఉత్తమమైన స్థితినందుకొన్న కృష్ణాపత్రికలో ఏదైనా వ్యాసం వ్రాయాలంటే-కొన్ని ప్రమాణాలు పాటించడం అవసరంగనుక-వాటిని పాటిస్తూ రచనలు సాగించడం జరుగుతూవుండేది. అది నాకు లభించిన వరం.

యుద్ధ సమయంలో కాగితం దొరకనప్పుడు పత్రికలో సంపాదకీయం, వడ గళ్ళూ ఈరెంటికీ ప్రథమావకాశం లభించేది. నేను కృష్ణాపత్రికలో, నవలలూ, కథలు, నాటికలు, గేయాలు-ఎన్ని వ్రాసినా, కాలక్రమాన 'వడగళ్ళ రావూరు' నైపో యాను. కొందరు రావూరునుకూడా వెనక్కునెట్టి 'వడగళ్లు' అని మాత్రమే వ్యవహ రిస్తూ వచ్చారు.

బంధువుల యింటికి వెళ్ళినా, పార్టీలకు వెళ్ళినా, సభలకు వెళ్ళినా, సంచారానికి వెళ్ళినా నా వడగళ్ళకోసం మనస్సు వెతుక్కొంటూనే వుండేది. ఏ విషయాన్నో ముక్కుకు కరచుకు వచ్చి కలానికి అందిస్తూనే వుండేది - నవ్వులపంటలు పండుతూనే వుండేవి.

ఈ శీర్షిక నడుపుతున్న కాలంలో-రెండుసార్లుమాత్రం-ఇతరులకు 'నొప్పి' కలిగించడం జరిగింది. ఒకవ్యాసం సూటిగా కొందరికి తగిలింది. మరొకటి కావాలని కొందరు భుజాలు తడుముకోవడంవల్ల ఏర్పడింది. ఈ రెండింటికీ కృష్ణారావుగారే సమాధానం వ్రాసి నామీద ఎలాటి అప్రతిష్ఠనీడా పడకుండా చేశారు.

ఆ రోజుల్లో కృష్ణారావుగారు 'లోవెలుగులు' అనే వేదాంతపు శీర్షిక నడుపు తూనే వుండేవారు. ఆ శీర్షికను సోదరా! అనేమాటతో ప్రారంభించి, ఎంతో గొప్ప వేదాంతంలోకి లాక్కుపోతూవుండేవారు. ప్రతి చిన్న వస్తువునూ బ్రహ్మ పదార్థంగా వర్ణిస్తూ వుండేవారు. ఒకరోజు నాకు వడగళ్ళకు వస్తువు దొరకలేదు. 'సోదరా!' అనేదాని మీద వ్రాద్దామనే కోరిక పుట్టింది. ఒక గృహస్థు అన్నం తింటుండగా దాంట్లో చిన్న మట్టిగడ్డ వస్తుంది. 'ఏమిటిది?' అని కోపంగా భార్యవంక చూస్తాడు. ఆమె వెంటనే...."సోదరా! మట్టిగడ్డను అలా తేలికగా చూడబోకు....అది పవిత్ర భూమండలంలో భాగం....ఆ మట్టిలో నుంచే మాణిక్యాలు పుడుతున్నాయి సస్య శ్యామలమైన ఆ ప్రకృతి ఎక్కడిది! ఒక్కసారి తిలకించు సోదరా....నీచర్మ చక్షు వులతో కాదు....మనోనేత్రంతో...." అని వడగళ్లు వ్రాశాను.

తీరావ్రాసిన తర్వాత భయం వేసింది. ఆ రోజుతో ఉద్యోగానికి స్వస్తి అను కొన్నాను. మర్నాడు పేజిప్రూఫ్ కృష్ణారావుగారు చూశారు. ఎదురుగా కూర్చున్న నేను ఆపాదమస్తకం వొణికిపోతున్నాను. ఆయన చిరునవ్వు నవ్వుతూ "ఇంకెవరూ దొరకలా సోదరా! నేను నీ మనోనేత్రంలో ప్రవేశించానన్నమాట" అన్నారు. నాకు నోట మాటరాలేదు. ఆ వ్యాసంకూడా దర్బారులో కాటూరివారిచేత చదివించుకొని మురిసిపోయారు కృష్ణారావుగారు. ఆయన హృదయమంతటిది.

ఒకసారి వారు రైల్లో ప్రయాణిస్తుండగా "కృష్ణాపత్రికలో 'వడగళ్లు' చదువుతూ వుంటాను. మీ దర్శనం అయింది" అంటూ ఒకాయన తను పడుకొన్న బర్తు కృష్ణారావుగారికి యిచ్చి ఆయన పెట్టెలమీద పడుకున్నాడుట. కృష్ణారావుగారికి నడుం నొప్పి ఉండేది. ఆరోజు బెడ్ మీద కూర్చుని ప్రయాణం చేయవలసి వచ్చిందిట. బెర్తు ఆఫర్ చెయ్యగానే వెళ్ళి పడుకున్నారుట. తిరిగి బందరు వచ్చినతర్వాత 'మీ పేరు కొట్టేశాను....శరీర బలహీనతలో నుంచి కూడా అబద్ధాలు పుట్టుకొస్తాయి.' అని పై కథంతా చెప్పారు. అది నాకు జరిగిన సన్మానంగా భావించాను.

జయపురం సంస్థానాధిపతులు శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు 'వడగళ్లు' ప్రతి వారం చదివించుకొని విని మురిసిపోతూ వుండేవారట. కొన్నాళ్ళ తర్వాత వారు పశ్చిమ గోదావరి జిల్లాల్లో పర్యటన చేస్తూ నన్ను పిలిపించి వడగళ్ళ రచన పురస్కరించుకొని నూటపదహార్లు, నూతన వస్త్రాలతో సత్కరించారు. నాకు జరిగిన ఆ సన్మానం కృష్ణాపత్రికకు జరిగినట్లుగా తెలియజేసుకొన్నాను. ఈ సన్మానం ప్రఖ్యాత నాయకులు శ్రీ మూర్తిరాజుగారింట్లో జరిగింది. ధనరూపంలో జరిగిన సన్మానం ఇది. మనస్సులో జరిగిన సన్మానాలు అనేకం. అవన్నీ ఆశీస్సులు. ఆ బలంతోనే 'వడగళ్లు' ఆపివేసినతర్వాత పదేళ్ళకు 'ఆషామాషీ' ప్రారంభించి పదేళ్ళకుపైగా వ్రాయగలిగాను.

వడగళ్ళు శీర్షిక....కొద్ది రోజులపాటు చుక్కాని, జ్యోతి వారపత్రికల్లో కూడా వ్రాశాను. అక్కడ పేరుతో వ్రాయడం జరిగింది. ఈ శీర్షికను కృష్ణాపత్రికలో ప్రచురించడానికి అవకాశం కల్పించి, ప్రోత్సహించినందుకు స్వర్గీయ శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి, నా కృతజ్ఞతాభివందనాలు తెలుపుకొంటున్నాను. వడగళ్ళను-గ్రంథ రూపంలో బయటికి తేవాలనే ఆసక్తివుంది. ఈ ప్రయత్నంలో వుండగా 'యువ భారతి' వారు ఒక చిన్న వడగళ్ళ గ్రంథం వెలువరించాలని సంకల్పించి, సహకరించ వలసిందిగా కోరారు. యువభారతి ఈనాడు చేస్తున్న సేవ అందరికీ విశదమే. వారి ద్వారా ఈగ్రంథం వెలువడడం ఉభయతారకంగా భావిస్తున్నాను. ఈ పొత్తాన్ని అశేష పాఠకలోకానికి అందచేయ సంకల్పించినందుకు యువభారతిని అభినందిస్తున్నాను.

రావూరు వెంకటసత్యనారాయణరావు

# వడగళ్లు

## 1. కృత్యాద్యవస్థలు

మానవులు నిత్యజీవితంలో ఎన్నో అవస్థలు పడుతూవుంటారు. తప్పుకొంటూ వుంటారు. ఈ అవస్థల్లోకెల్లా అతి అందమైంటీ, అనుభవయోగ్యమైంటీ ఒక అవస్థ వుంది. అది కృత్యాద్యవస్థ. దీన్ని ఏదో ఒక సందర్భంలో అనుభవించనివాళ్ళుంటూ వుండరు.

ఎంత సాధనచేసిన విద్య అయినా, ఎంత అలవాటు అయిన కళ అయినా-ప్రతి వ్యక్తి మొదట్లో వాటిని సాగదీసేందుకు సానపట్టేందుకూ ఎంతో అవస్థ పడతాడు. చూడండి గొప్పగొప్ప సంగీత విద్వాంసులు పాట ప్రారంభించుతారా! మొదట్లో వాళ్ళకంటె మనకు బాగా పాడతామనిపిస్తుంది. "కొంచెం పెగిలిరావే రాగమా! నీకు మ్రొక్కుతాను. లేకపోతే నా పరువు బండలైపోతుంది." అన్నట్టు ఎంతో పెనుగులాడతారు పాపం. కొంత సేపటికి తడిగడ్డి రాజిరాజి అంటుకున్నట్లు అంటుకుంటుంది స్వరం.

కూచిపూడి భాగవతులు నాటకమాడుతుంటే-కొంచెం తెలిసిన వాళ్ళు ఒక్క కునుకుతీసి మరి వెడుతూవుంటారు. అప్పటికి నాటకం కృత్యాద్యవస్థ దాటి కొంచెం రక్తికడుతుంది.

ఇక కథో, కవిత్వమో వ్రాద్దామని కవులు కలం తీసినప్పుడు వుంటుంది తమాషా! ఒక పంక్తి వ్రాయను-కొట్టివెయ్యనూ. మళ్ళీ వ్రాయను-మళ్ళీ గీతపెట్టనూ, కాగితం జడలమాతంగిలాగా తయారవుతుంది. అలాటి సందర్భపు పెయింటింగులు అయిదారు వేస్తేగాని అసలురూపం బయటపడదు. కొందరు ఒక వ్యాసం వ్రాయాలంటే పదిపేజీలు చించివెయ్యాలి. కలం చివరంతా ముఖంపుల్లలాగా నమిలివెయ్యాలి. అప్పటికి స్విచ్ ఆన్ అవుతుంది.

ఆడవాళ్ళు రోజూ అంటించే నిప్పేనా! అది చూడండి వంట ఆరంభించే ముందెంత మారాం చేస్తుందో! కట్టె పొయ్యి అవస్థలు పడలేకనే ఇప్పుడంతా స్టవ్‌లు, కుంపట్లు ప్రారంభించారు. కిర్సనాయిల్ కరువు వచ్చిన తర్వాత వీటివిషయంలోనూ కృత్యాద్యవస్థ తప్పడంలేదు. ఇక మగవాళ్ళు వంట ప్రారంభిస్తే-ఆ కుంపటి

నిజంగా కుంపటి అయిపూరుకొంటుంది. స్టవ్ వెలిగితే ఒక్కసారి వెలుగుతుంది లేక పోతే అసలు వెలగదు. సమ్మె చేస్తూవుంటాయి ఈ రెండూ మధ్యమధ్య.

చూడండి! సైకిలంటూ వుంది. దాన్ని ఉపయోగించడం చేతనయిన తర్వాత ఎంతో సుఖం వుంది. కాని నేర్చుకొనేటప్పుడెంత అవస్థ! ఒకటిరెండురోజులు ఏపట్రనో కాలుకు తీసుకొని పంచె పైకికట్టి, పళ్ళు బిగించి-అదో అవతారం దాల్చి-సాధన ప్రారంభించాలి. దాన్నే 'పట్రపానింగ్' అంటారు. ఇది కొంచెం అలవాటైన తర్వాత ధైర్యంచేసి ఎక్కబోయి ముందుకుపడి రూపాయలంతా, అర్ధరూపాయలంతా, పావలాల మేరకు శరీరం ఎర్రపరచుకొంటారు. ఆ అవస్థదాటిపోతే-ఉన్న పిల్లలందర్నీ వెనకా ముందూ కూచోబెట్టుకొని బజారులన్నీ తిరగవచ్చు పాతసైకిల్‌మీద.

ప్రేమను సంపాదించడం విషయంలోకి వస్తే-ఎంత కృత్యాద్యవస్థ. ఒక గూట్లో గువ్వలాగా కూర్చున్న హృదయాన్ని బులిపించి, వలపించి, బయటకురావాలి. మంత్రాలకు చింతకాయలురాలే ఘట్టమా అది! రెండవ హృదయాన్ని అర్థంచేసుకొని, అవుననిపించుకొని-ఆవలప్రపంచంలో అడుగుపెట్టేలోగా ఎన్నిసుడిగుండాలు-ఎన్ని తుఫానులు? యజ్ఞంలో కొయ్యనుంచి నిప్పు పుట్టించినంత అవస్థ అవుతుంది. ఈ అవస్థ దాటిన రసికుడు కోటలో పాగావేసి కూర్చుంటాడు. అప్పుడూ 'రాధవునీవై, కృష్ణుడనేనై' అనగలిగేది.

కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది. కృత్యాద్యవస్థ అధికమైన కొద్దీ, దానితర్వాత లభించే సౌఖ్యంకూడా అధికమవుతుందని. మానవులకే ఈ అవస్థ అనుకుంటే-యంత్రాలకు కూడా వుంది. రైలు చూడండి! ప్రతి స్టేషనుదగ్గరా ఆగుతుంది. మళ్ళీ బయలుదేరాలంటే అత్తవారింటి దగ్గరనుంచి బయలుదేరే అల్లుడు పడ్డంత అవస్థ పడుతుంది. ముందుకు సాగబోయి ఒకసారి వెనక్కి గుద్దుకొని 'కూ' అని గోలపెట్టి ఇన్ని కన్నీళ్ళు కార్చి 'తప్పదురా దైవమా' అని ఏడుస్తూగాని ముందుకుసాగి స్పీడు అందుకోదు.

రైలు సంగతి అలా వుంచండి-మా బందరులో గుర్రపు బళ్ళకూడా ఈ కృత్యాద్యవస్థ వుంది. ఏకోర్టు పనిమీదనో, రైలుస్టేషనుకనో, గుర్రపుబండి కుదుర్చుకొని ఎక్కి కూర్చోగానే-ఆ గుర్రం ఇల్లరికపు కూతురులాగా ముద్దులు ప్రారంభిస్తుంది. కొంచెంసేపు బండి వెనకకు నెట్టుతుంది. రోడ్డుకు అడ్డంగా తిరుగుతుంది. ఇక వెనక కాళ్ళతో బండిని తన్నడం ప్రారంభిస్తుంది. గుర్రం కదలదు. బండివాడు లోపలవాళ్ళను దిగనియ్యడు-టైం ఆగదు....ఆ విధంగా బండిలోవాళ్ళు హతమారి, అవతల పెట్టుకొన్నపని పూర్తిగా నాశనమైతే గాని ఆ అశ్వరాజం ముందుకు సాగదు.

(1949 జనవరి 8)

# 2. ఊతపదాలు

సామాన్యంగా మనం మాట్లాడుతున్నప్పుడు ఉపన్యాసాలిచ్చేటప్పుడు కొన్ని ఊతపదాలు దొర్లుతూవుంటాయి. మాట్లాడేవారు ఆ మాటల్ని ఎక్కువగా గుర్తించక పోయినా వినేవారికి ఒకప్పుడు విసుగ్గాను, ఒకప్పుడు వింతగాను వుండక తప్పదు. ఉదాహరణలు అనేకం.

మా కాలేజీలో తెలుగు పండితుడొకాయన ఒక పిరియడ్‌లో "పక్షంలో" అనే మాట మూడువందలసార్లు వాడేవాడని విద్యార్థులు రుజువుచేసుకున్నారు. "మీరు ఇలా అల్లరి చేసే పక్షంలో, పరీక్షలలో సరిగా వ్రాయలేని పక్షంలో, అపకీర్తి నానెత్తిన పడ్డపక్షంలో, కాలేజీపక్షాన, ప్రిన్సిపల్‌గారు నన్ను సంజాయిషీ కోరే పక్షంలో...." ఇలా నడిచేది ఆయనగారి ధోరణి.

మరో తెలుగు పండితుడు ఎక్కువగా "యొక్క" అనే మాట వుపయోగించేవాడు. "ఈ యొక్క పద్యం చాలా ముఖ్యమైంది. మీ యొక్క నోటుబుక్కులు తెరిచి, ఈ యొక్క అర్థాలు వ్రాసుకోండి"—ఇదీ ఆయనగారి శైలి.

ఇంగ్లీషులో ప్రసంగించేవారికి వెల్, దెన్, సో, మొదలైన ఊతపదాలు ఎక్కువగా దొర్లుతూ వుంటాయి. ఒక కాలేజీ ప్రిన్సిపాల్ గారికి 'వెల్' అనే మాటలు వాడక పోతే వాక్యం నడిచేదేకాదు. ఒకసారి ఆయనగారు త్రిలోకాలను గురించి మాట్లాడుతూ—వెల్ పాతాళం, వెల్ వైకుంఠం, వెల్ బ్రహ్మలోకం, వెల్ ఈ మూడులోకాల్ని వెల్ త్రిమూర్తులు పాలిస్తూ వుండటం—వెల్ ఎంత గొప్ప?—ఇలా ఎన్నో వెల్సు. ఆయనగారు ఒక గంటలో వుపయోగించే వెల్సు, మద్రాసు రాష్ట్రంలో (ఉమ్మడి) జిల్లాబోర్డు నూతులకన్న చాలా ఎక్కువగా వుంటాయని తేల్చారు.

కొందరు మనతో మాట్లాడే టప్పుడు, మధ్యలో ఆపి, 'నేను చెప్పేది అర్థమైందా' అనడం అలవాటు. 'బజారువెళ్ళి పావలా పెట్టి పళ్ళుకొని తిరిగి వస్తున్నా. ఏం నేను చెప్పేది అర్థమైందా....!' ఇందులో అర్థంకానిదేంవుంటుందో? అయినా ఆయన ప్రశ్నిస్తూనే వుంటాడు.

మరికొందరు మనతో మాట్లాడుతూ మధ్యలో 'నీకేమైనా పిచ్చా?' అని సూటిగా ప్రశ్నిస్తూ వుంటారు. ఒక వ్యక్తితో ప్రసంగిస్తూ ఆయన ఈ ప్రశ్న వేసేటప్పటికి ఆశ్చర్యపోయి "నాకు లేదండీ! రెండు మూడేళ్ళక్రింద మా తమ్ముడికే కొంచెం పిచ్చెక్కింది. భగవంతుని దయవల్ల ఇప్పుడు తగ్గింది" అన్నాడట.

ఇంతకన్నా విచిత్రమయిన వూతపదాలున్నాయి. మా మేనత్త ఒకామె మాట్లాడితే "శాస్త్రం చెప్పినట్లు" అంటుంది. నేను వాళ్ళ వాకిట్లోకి వెళ్ళగానే—'ఇంత ఎండలో వచ్చావేం! అంతా కులాసాగా వున్నారా! శాస్త్రం చెప్పినట్లు వస్తూపోతూ వుంటేనే

చుట్టరికాలు. కాళ్ళు కడుక్కో! రెండు మెతుకులు తిందువుగాని శాస్త్రం చెప్పినట్లు, అనేది. అదేం శాస్త్రమో ఎవరు చెప్పారో దైవానికి తెలియాలి.

మరికొందరి మాటల్లో 'అన్నట్లు' వాడటం చాలా యిష్టం. ప్రతి వాక్యంలో ఈ అన్నట్లు ఎన్నో పడుతూ వుంటాయి. "అన్నట్లు ఆ అబ్బాయి వాకిట్లోకి వచ్చాడా! పోనీ ఒక్క నిముషం కూర్చోకూడదూ!....అన్నట్లు అప్పుడే లేచిపోయాడు. అది ఏమంత మర్యాదా!....అన్నట్లు మనం చెపితే వింటారా"–ఇదీ ఆమెగారి ధోరణి.

కొందరు మాట్లాడుతూ "అసలు నీకు బుద్ధి వుందా అంట?" అని ప్రశ్నించడం మనం తబ్బిబ్బు కావటం తటస్థిస్తూ వుంటుంది. ఆ మాట నీకు అనేది ఏ తృతీయా పురుషకో చెందుతుందనేది మనకు తర్వాతగాని అర్థంకాదు.

మా వూళ్ళో ఒక ఆమె "నీకు కోపంవస్తే నే చెప్పలేను" అంటూ వుంటుంది. మనకు కోపం చాలాసేపటిక్రిందే వచ్చినా బయటపెట్టడానికి వీలు కుదిరేదికాదు. ఒక ప్రముఖ నాయకుడు వుపన్యాసంలో "వర్తమానకాలంలో" అనే తరుచు వుపయోగించేవాడు. భీమా డిండిమ శ్రీ చెరుకువాడ నరసింహం పంతులుగారు "భవిష్యత్తులో" అనే మాటను వాడుతూనే వుండేవారు ఆ భవిష్యత్తు ఎంత ముందుకు జరిగినా!

ఈ ఊతపదాలంటే ఊరికే తీసిపారేసేవి కావు–ఊత తప్పితే, ఉబుసూ, ఉత్సాహం ఎక్కడవుంటుంది? (1941 సెప్టెంబరు 6)

# 3. అలవాట్లూ – పొరపాట్లూ

ఆయా వృత్తుల్నిబట్టి వ్యక్తులకు కొన్ని విడిచిపెట్టలేని అలవాట్లు ఏర్పడుతూ వుంటాయి. వాటిని వాడటంలో కొన్ని పొరపాట్లు జరుగుతూ వుంటాయి.

బస్సు కండక్టరుగా పనిచేసే ఒక పెద్దమనిషి శెలవుపెట్టి పెళ్ళికి వెళ్ళాడుట. పెళ్ళివారు దగ్గిరబంధువు లవడంవల్ల వడ్డన సమయంలో ఆయన పప్పు, కూర వడ్డన ప్రారంభించాడుట. కొంచెంసేపు 'పప్పు, కూర' అని పంక్తిలో వడ్డన సాగించి మధ్యలో హఠాత్తుగా "ఏలూరు, గుడివాడ – ఏలూరు, గుడివాడ" అని బిగ్గరగా కేకలు వేయడం ప్రారంభించాడుట. [ఆ రోజుల్లో ప్రయివేటు బస్సులవారందరూ అలా గంటల తరబడిగా కేకలుపెట్టి ప్రయాణీకుల్ని ఆహ్వానించేవారు.]

పగలల్లా టైపుమిషనువద్ద కూర్చుని పనిచేసే ఒక వ్యక్తి ఇంటికి వెళ్ళి భోజనం దగ్గిర కూర్చుని అపోసనంపట్టి....ఆ అన్నంమీద పదివేళ్ళతో టైపుచేయడం ప్రారంభిస్తూవుంటాడు. భార్య అదిచూచి "స్వామీ! ఇది అన్నం....టైపుమిషను కాదు!" అని హెచ్చరించగానే ఆయన తెప్పరిల్లి పప్పు కలపడం ప్రారంభించుతూ వుంటాడుట.

గవర్నమెంటు ఆఫీసుల్లో పనిచేసే అధికారులు ఏ కాగితం వచ్చినా క్రిందివారికి పంపడం ఆచారం కదా! వెనుకటికి ఒక తహసీలుదారుగారిభార్య పుట్టింటినుంచి ఒకసారి వచ్చి చూచి పోవలసిందనీ, పిల్లలూ తానూ బెంగపెట్టుకొన్నామనీ వుత్తరం వ్రాసిం దిట. ఆ ఉత్తరం ఆఫీసుఫైళ్ళు చూస్తుండగా అందిందిట. వెంటనే దానిమీద "తగు చర్యనిమిత్తం రివెన్యూ ఇనస్పెక్టరుకు పంపడమైనది" అని వ్రాసి సంతకంచేసి ప్యాడులో పెట్టాడుట.

పరీక్ష పేపర్లు దిద్దే సమయంలో ఒక తెలుగు మాష్టరుగారికి భార్యవద్దనుంచి ఉత్తరం వచ్చిందిట. ఉత్తరమంతా చదివి, వ్యాకరణ దోషాలన్నీ మార్కుచేసి, తప్పు సమాసాలు అండరులైను చేసి, దస్తూరి ఇంప్రూవ్ చేసుకోవాలని రిమార్కు వ్రాసి ముప్పయిరెండు మార్కులు వేశాడట. మల్లినాథసూరిగారు ఆఫీసు ఉత్తరాలు వ్రాసి, అడుగున మేనేజరు అని హోదా ఉటంకించి, మేనేజరుగారి సంతకంకోసం పంపడం అలవాటు. ఒకసారి మరదల్ని హాస్యంచేస్తూ కార్డువ్రాసి దాన్నికూడా మేనేజరు సంతకం కోసం పంపారు. మేనేజరు ఉత్తరం చదివి "ఈ విజయలక్ష్మి ఎవరయ్యా.... ఏమిటీ ఉత్తరం.... ఇలాంటివి వ్రాస్తే వీపు వాయిగొడతారు" అన్నారుట మేనేజరుగారు. మల్లి నాథులు, "అది.... మా.... మరదలిదిలెండి.... సంతకం చెయ్యకండి" అని తీసుకున్నా రట. వారికి మరి పుట్టెడు నత్తి –

పత్రికలో పనిచేసే ఒక జర్నలిష్టు మామగారికి ఉత్తరంవ్రాసి – హెడ్డింగులు పెట్టడం అలవాటు గనుక శ్రీయుతులు.... అన్నచోట డబుల్‌కాలం, జి. పి. 36 బ్లాకు అని వ్రాసి, వందనములు అన్నచోట.... యస్. బి. అని వ్రాసి – మేటరుప్రక్క 12 పాయింటు అని వ్రాసి కంపోజింగ్‌కు పంపాడుట.

ఇటీవల ఒక వ్యాపారస్థుడు – అసెసర్‌గా నియమింపబడ్డాడట. తమ్ముడూ, ఆయన జాయింట్ వ్యాపారస్థులు. ఒక క్రిమినల్ కేసులో జడ్జి అతణ్ణి అడిగాడట నీ అభిప్రాయ మేమిటి? అని. అతడు క్షణం ఆలోచించకుండా – మా తమ్ముడివీ నావీ ఒకటే అభిప్రాయం, ఆరు నూరయ్యేది నూరు వెయ్యి అయ్యేది. అంతా జాయింట్ కాదండీ....(భార్యలు, సంతానం తప్ప) అన్నాడుట. జడ్జి తనలోతాను నవ్వుకొని "ఈ నేరాన్నిగురించి నీ అభిప్రాయ మేమిటి" అన్నాడుట. వ్యాపారస్థుడు ఇంకోళ్ళ నేరంమాట నా కెందుకు. నాకు నేరాలంటే చాలా భయం. మొన్ననే నే తూచినరాళ్ళను శిఖాలు వేయించాను. తూనికలో దాశాలేదు. తూనీగ వ్రాలితే వంగిపోతుంది – నా కింకేం భయం" అని కూర్చున్నాడట.

ఆడవేషాలు వేసి పేరు సంపాదించిన నటుడొకాయన మందుకోసం డాక్టరు దగ్గరికి వెళ్ళి ఎడమచెయ్యి అందించాడుట. డాక్టరుగారు నవ్వి "ఇక్కడకూడా ఎడమ చెయ్యి ఎందుకు? కుడిచెయ్యి ఇలా ఇయ్యి" అని తీసుకొన్నాడుట.

అందరూ సామాన్యంగా చెప్పుకొంటూవుండే కథ ఒకటివుంది. కొందరు వ్యక్తులు ఎర్రటి విగ్రహంగల ఒక గాజుల తాతకు స్వాములవారి వేషంవేసి ఊరూరా తిరిగి విందులారగిస్తున్నారుట స్వాములవారు ఎక్కువగా మౌనవ్రతం దాల్చేవారుట. ఒకనాడు పెద్ద సభజరిగింది. వేలకు వేలు ప్రజలు వచ్చారు. ఇంతలో వీధిలో "జలతారు గిన్నెలు" అనే కేక వినపడింది. "అయ్యో వాడలా అమ్ముకొంటున్నాడు. నేనిలా కూర్చోవడమేమిటి?" అని స్వాములవారు లేచి అక్కడ ఒక మూలనున్న కంబళి భుజాన వేసుకొని "గాజుల బత్! గాజుల బత్!" అంటూ వీధివెంట బయలుదేరాడుట. ఇలాటి వినోదా లెన్నోవున్నాయి. తవ్వితే తేగల పాతరలు. (1944 ఏప్రిల్ 9)

# 4. సిగ్గుల నిగ్గులు

సామాన్యంగా మనంవాడే భాషలో, సిగ్గు అనే శబ్దానికి రెండు అర్థాలున్నాయి. ఒకటి సిగ్గంటే చిద్విలాసం, శృంగారచేష్ట. రెండు సిగ్గు అంటే - అవమానం, లజ్జ అని అర్థం. మనం మొదటిరకపు సిగ్గునుగురించే ఆలోచిద్దాం.

కొత్త పెళ్ళికూతుళ్ళను-"సిగ్గులమొగ్గలు" అనడం ఆచారం. బాల్యంలోనుంచి యౌవనంలోకి వురుకుతూండే వయస్సులో కన్నెపిల్లలకు కలిగే భావ వికసనంలో కనిపించే తత్తరపాటును సిగ్గు అనవచ్చు. తన జీవిత వసంతంలో ఝుమ్మని తిరగనున్న తుమ్మెద కుమారుణ్ణి చూచినప్పుడు కలిగే సంభ్రమాన్నికూడా సిగ్గనే అంటారు.

నవోఢలో దాగిన కోరికలు, వాటి ననుసరించే .... — ఒక్కసారిగా పూల జల్లుగా కురియసాగినపుడు కలిగే మైమరపునుకూడా సిగ్గుక్రిందనే జమకట్టవచ్చు. ఎవరో గడుసుకత్తెతప్ప సామాన్యంగా ప్రతి పెండ్లికూతురూ భర్తను చూడగానే తల వంచుకొని, తన రెక్కలలో తాను వొదిగి, కుదించుకొని కూర్చుంటుంది.

ప్రియుని చూపులతో కలసి మల్లెపందిరు లల్లుకోవలసిన తన చూపుల్ని పెళ్ళి కూతురు తల వంచుకొని తన చూపుల్ని తన సొగసుపైన జల్లించుకొంటుంది. ఆమెలో ఆనందం పైకుబికి పరుగులెత్తుతుంటే - హృదయం దాన్ని అదలించి వెనకకు మరలిస్తూ వుంటుంది. అప్పుడామె తనచుట్టూ వలపులనే రంగురంగుల ఉంగరాలు సృష్టించుకొని వాటిలో బంగారు బొంగరంలా తిరుగుతూ వుంటుంది.

సిగ్గుకు సొగసు కల్పించేవి - వయస్సూ, మనస్సూ, వయస్సు మళ్ళినతర్వాత కూడా కొందరు వనితలు సిగ్గును అభినయిస్తారు — వలపు విలువను చెల్లించడంకోసం. కాని దానిలో సహజమైన ఉద్వేగం, ఉత్సాహం మృగ్యం.

మన కావ్యాలలో సిగ్గులోగల చిలిపితనాన్నిగురించి అతిసుందరంగా వర్ణించారు. స్త్రీలకు సిగ్గు వెలలేని ఆభరణమన్నారు సిగ్గుదొంతరగల తెరల నొక్కొక్కటే చుట్టి

వేసి అందాన్ని మూటగట్టి చేతికందించినట్లుగా నిలబడే వయసుకత్తెలో ఎంత అందం వుంది. సిగ్గుపడి నవ్వినప్పుడామె చిరుచెక్కిళ్ళలో పడే సొట్టలపై వ్యాఖ్యానం ఎంతని వ్రాయగలరు?....

మగవాడికికూడా సిగ్గు అనే లక్షణం లేకపోలేదు. కాని దానికో అందంగాని, ఆకర్షణగాని వుండదు. పండిన మొక్కజొన్న చేనుపైన కంకెలో రామచిలుక వ్రాలి, పచ్చని రెక్కలు రెపరెప విసురుతూ ఎర్రటి ముక్కుతో ఒయ్యారంగా జొన్నపొత్తుల నారగిస్తూ ఎంత సొగసు కల్పిస్తాయో - పదిమంది పడుచుకత్తెలొకచోట చేరినపుడు వారి చేష్టలు, చిలిపితనం, సిగ్గులు, అంతటి శోభను ప్రసాదిస్తాయి.

కోరిన ఒక క్రొత్తలోకంలోకి, వ్యక్తిలోకి, విశేషంలోకి తొంగిచూసినప్పుడు ఒకవిధమైన సిగ్గు ఆవరిస్తుంది. ఆ క్రొత్తవెలుగును మనస్సులోకి తెచ్చుకోవడంకోసం పొందే తత్తరపాటునుకూడా సిగ్గనే అంటారు.

కొన్ని కొనితెచ్చుకొన్న సిగ్గులుంటాయి. ఉదాహరణకు చూడండి.... పెళ్ళిలో ఒక వనితను పిలిచి మంగళహారతి పాడమంటారు. పాడాలని వున్నా చాలాసేపు తటపటాయిస్తుంది. తల వంచుకొంటుంది. పారిపోవడానికి ప్రయత్నిస్తుంది.... అదంతా కొనితెచ్చుకొన్న సిగ్గును గొప్పగా అభినయించడానికి చేసే ప్రయత్నం. తర్వాత ఎప్పుడోగాని ఆమె పాట ప్రారంభించదు. కొందరు సగంపాట పాడి కళ్ళు పైకెత్తి - సిగ్గుకెరటాలు తమమీద దొర్లి నిలవనీయనట్లుగా - హారతి పళ్ళెంవిడిచి పారిపోతారు ఆమె నిలబడి పాడడంకంటె.... అలా పారిపోవడంలోనే ఎక్కువ అందం వుంటుందొకప్పుడు. స్త్రీ నిజంగా సిగ్గుల భరిణ అయినప్పుడే అందాలు చెరిగిపోస్తుంది.

( 1950 ఆగష్టు 9 )

# 5. హాబీలు

హాబీ సామాన్యంగా మనం ఈ మాట వింటూనే వుంటాము. ఫలానావారికి ఫలానా హాబీ ఉన్నదని, హాబీ అంటే కొన్ని వస్తువులమీద, పనులమీదా కొందరికి గల ఆనందం-సరదా!

ఈ ఆనందానికి మించిన ఆనందం వారికి ప్రపంచంలో మరి ఎక్కడా చిక్కదు.... కాని రానురాను కొందరికి హాబీ ఒక వేలంవెర్రిగా మారిపోతుంది. హాబీలు అనేక రకాలుగదా!.... కొందరికి కుక్కల్ని పెంచడం హాబీ అయితే కొందరికి గొర్రెల్ని పెంచడం హాబీ కొందరికి పిల్లలతో ఆడుకోడం హాబీ అయితే కొందరికి తల్లులతో ఆడుకోడం హాబీ!

ఇటీవల వచ్చిన వార్తల్ని బట్టి ఒక తెలుగు ఫిలిమ్ డైరక్టరుగారు-ఎప్పుడూ ఇరువురు ముద్దుల తారలమధ్య చేరి కాలం గడపడం హాబీగా మార్చుకుని, అనుకోని అవస్థలు పడుతున్నారుట. నిజానికి సినిమా ప్రపంచం అవతరించిన తర్వాత ప్రజలలో ముఖ్యంగా విద్యార్థులలో-అందులో కాలేజీ విద్యార్థులలో హాబీలు ఎక్కువైనాయి.

ఏ విద్యార్థినైనా పలకరించి-"నీ హాబీ ఏమిటి" అని ప్రశ్నించండి?.... "నా హాబీ సినిమా తారల ఆటోగ్రాఫులో, ఫొటోగ్రాఫులో సమకూర్చడమని" వెంటనే సమాధాన మిస్తాడు.

ఇటీవల ఒక మిత్రుడు చెప్పాడు-తను ప్రఖ్యాత తార నర్గీస్ బొమ్మను సంపాదించడమనే హాబీ కల్పించుకొన్నానని. ఎలాగయినా సరే ఆమె ఫొటోలు వంద పోజులలో సంపాదించేదాక నిద్రపోదలచుకోలేదట.

హాబీ అనేది ఒక్క యువకుల్లోనేకాదు- పెద్దల్లోకూడా వుంది. చచ్చి స్వర్గాన వున్న ఛాంబర్లయిన్ ప్రధానికి రకరకాల గొడుగుల సంపాదించడం హాబీ! ఇప్పటికీ చర్చిల్‌తాతకు-ఎన్నోరకాల చేతికర్రలు సంపాదించడం హాబీ.

బ్రిటిష్ చక్రవర్తికి అవకాశం కలిగినప్పుడెల్లా భార్యచేత ఉపన్యాసాలిప్పించి తాను వెనక కూర్చుని మురుసుకోవడం, నవ్వుకోవడం హాబీ....ప్రస్తుతః ఈయన నత్తివాడు. ఒక లోపం లోనుంచి ఏర్పడిన ప్రలోభం హాబీగా మారింటీయనగారికి.

గ్రీసు చక్రవర్తి జార్జికి తన బట్టలు తాను ఇస్త్రీ చేసుకోవడం, మడతబెట్టుకోవడం గొప్ప హాబీ! విండ్సరు ప్రభువుకు-తానెవరో ఇతరులకు తెలియకుండా-ఫిలిం మొదలుపెట్టిన తర్వాత మామూలు ప్రేక్షకులలో కూర్చోవడం-ఫిలిమ్ పూర్తిగాకముందే లేచిరావడం హాబీ! సామాన్య ప్రజాజీవితంమీద గల అభిమానమే అతన్ని చివరకు సామాన్యుణ్ణిగా మార్చింది.

బీవర్ బ్రూక్ ప్రభువుకు ఇంట్లోవున్నంతసేపూ నగ్నంగా ఉండడం హాబీ! ఒక్కొక్కప్పుడు ఆయన అలా పచార్లు చేస్తూనే-ప్రెస్ రిపోర్టర్లకు, తన కార్యదర్శులకు స్టేటుమెంటు ఇచ్చేవారట.

వెనుకటికి ఒక జడ్జీగారికి భార్య సవరంతో ఆడుకోవడం గొప్ప హాబీ! కోర్టుకు వెళ్ళేటప్పుడు సవరం జేబులో పెట్టుకు వెళ్ళేవాడట. లంచ్ సమయంలో, ప్రయివేటురూములో జేరి-ముందుగా సవరంతో ఆడుకొని తర్వాత సాపాటు చేసేవాడట.

ఒక కలెక్టరుగారికి కత్తెర చేతపుచ్చుకొని ఏదో ఒకవస్తువును సన్నగా కత్తిరించడం హాబీ....పనిమీద ఎవరైనావస్తే-వాళ్ళమీసాలు, జుట్టు కత్తిరించేవాడట.

ఒక్కొక్కప్పుడు వాళ్ళ కోటు కత్తిరించి మురుసుకొనేవాడట. ఆ కలెక్టరు దొరగనుక అందరూ గజగజ వణికి వూరుకొనేవారుట.

మేము కాలేజీలో చదువుతున్నప్పుడు మా లెక్చరరు గారొకాయనకు-పెద్దవాళ్ళ దగ్గర పెన్సలుముక్కలు సంపాదించి దాచడం అలవాటు. ప్రతిరోజూ క్లాసులో ఒక పెన్సలుముక్కతీసి "ఇది ఎవరిచ్చారో తెలుసా? టిప్పు సుల్తాను మునిమనుమని మునిమనుమడు.... దీన్ని నా ప్రాణంకన్నా ఎక్కువగా చూసుకుంటున్నా"-అని ఆ పిరిదంతా ఉపన్యాసమిచ్చేవాడు.

ధనవంతులకు, జమీందార్లకు వింతవింత హాబీలుంటాయి. గుర్రపుపందాలు, కోడిపందాలు, కుక్కలపందాలు ఇత్యాదులమీద వారికెంతో మోజు. వాటికోసం గుమ్మరించే సొమ్ము అంతా ఇంతా కాదు. చనిపోయిన వల్లూరి రాజావారికి దేశవాళీ కుక్కల మీద మోజు ఎక్కువగా వుండేదిట.

కొందరికి స్త్రీల బూట్లు సంపాదించడం హాబీ....కొందరికి వాళ్ళ హాట్సు సంపాదించడంలో అమితమైన సంతృప్తి. జేమ్సు జాన్ అనే ఆయనకు రంగురంగుల సీతాకోక చిలుకల్ని సంపాదించటం హాబీ. అందుకోసం ఆయన అమెరికా, జపాను, చైనా, బర్మా, జర్మనీ దేశాలు స్వయముగా తిరిగి నలభై సంవత్సరాలు కష్టపడి 10,000 పౌనులు ఖర్చుపెట్టి 15,000,000 సీతాకోక చిలకల్ని సంపాదించాడు. చివరకు ఆయన తిండికి మాడవలసిన పరిస్థితి ఏర్పడింది. కాని అందులో ఆయన ఒక్కటి కూడా అమ్మడానికి ఇష్టపడలేదు.

హాబీ అంటే ప్రాణంకన్నా గొప్పది. మా ఆఫీసులో పాతవిగ్రహాల వరుస నడగండి....హాబీలో ఎంత ఆనందం వుందో చెపుతాయి. (1948 జనవరి 8)

# 6. యుద్ధం తెచ్చిన భాష

[రెండవ ప్రపంచ సంగ్రామకాలంలో-ఎక్కడ చదివినా, విన్నా యుద్ధ వార్తలే కనిపించేవి. ఆబాలగోపాలం వాటిని శ్రద్ధగా వినేవారు. కొన్ని ఘట్టాలు మనస్సుకు హత్తుకుపోయేవి. వాటినుంచి కొన్ని ఉపమానాలు బయలుదేరినాయి. కొన్నిటినీ వ్యాసంలో గమనించవచ్చు.]

యుద్ధం రాజకీయంగా అనేకమార్పులు తెచ్చింది. భాషలోకూడా మార్పురావడం గమనించాలి. రేడియో వినేవారూ, పత్రికలు చదివేవారూ యుద్ధానికి సంబంధించిన భాషను-ఎండబెటి దాచిన వొడియాలలాగా-ఎప్పుడుపడితే అప్పుడు వాడేస్తున్నారు. టెక్నికల్‌గా వాడే మాటలుకూడా చాలామందికి వచ్చేసినాయి. వాటిని మనవాళ్ళు క్రొత్తక్రొత్త భావాలలో పొదిగి అందిస్తున్నారు.

ఒక వ్యక్తి మరో వ్యక్తి జీవితాన్ని పాడుచేసుకొన్నాడని చెప్పవలసివస్తే- "ఫలానావాడు ఆ వెంకటరావు జీవితాన్ని టార్పెడో చేశాడురా" అనడం కద్దు ఉద్యోగం దొరక్క సంసారం సరిగ్గానడవని మిత్రుణ్ణి పలకరిస్తే "ఏం చెప్పను బ్రదర్ ! నాకు ఇంట్లోనూ బయట అంతా 'బ్లాక్ అవుట్'గా వుంది" అని చెప్పి నీళ్లుకారాడు.

ఇక చదువుకొన్న ఇల్లాలు తన యింట్లో పిల్లిదూరి నేతిగిన్నె నాకిపోయిందని చెప్పడానికి "నేను తలుపుదగ్గరకు వచ్చేటప్పటికి అది మెల్లగా నేతిగిన్నె దగ్గరకు పురోగమిస్తుంది. నా కాలి అలికిడి విన్నది. వెంటనే వెనుకకు తిరిగి మ్యావ్ మ్యావ్ మంటూ తిరోగమించింది."

ఇటీవల మేము ఒకరి యింట్లో జరిగిన విందుకి వెళ్ళాం. చాలామంది పెద్దలు వచ్చారు. అందులో విదేశంనుంచి సెలవుమీద వచ్చిన ఒక ఉద్యోగికూడా వున్నాడు. అందరి భోజనాలు అయిపోయినాయి. పెరుగు ముద్దలు నంజుతున్నారు. ఆసమయంలో విదేశంనుంచి వచ్చిన పెద్దమనిషి....పులుసు తర్వాత మళ్ళీ ఆవకాయ కలపడం సాగించాడు. అది చూచి పక్కనున్నాయన హాస్యంగా అన్నాడు-"ఏమిటి స్వామీ తమరు 'రియర్‌గార్డు' యాక్షను సాగించారిప్పుడు" అని. అంతా నవ్వుకొన్నారు.

ఎవరైనా కారుల్లోనో, బస్సుల్లోనో చుట్టలు వెలగించి ధూమవలయాలు వదులు తుంటే పక్కవాళ్ళు "స్మోక్ స్క్రీన్ వేశాడురా బాబూ !" అనడం వింటూవుంటాం. ఇటీవల ఒక ఉద్యోగి యింటికి అత్తగారు వచ్చింది. ఆవిడ చాలా గయ్యాళి.... కూతురూ అంతే. ఆయన ఇద్దరి ధాటికీ తట్టుకోవడం కష్టమని జంకి భార్యను పిలిచి "ఏయ్ ! ఒక ఫ్రంట్‌లోనే జయించలేకుంటే- సెకండు ఫ్రంట్ జాయిన్‌చేశావెందుకు ?" అంటూ తెల్లటవెల్ పైకెత్తి విసురుతూ "సంధి ! సంధి !" అని అరిచాడుట.

ఒక మేష్టరుగారికి నలుగురయిదుగురు పిల్లలున్నారు. వాళ్ల ఇంట్లో ఏ వస్తువూ బ్రతకనివ్వరు. కలం ఒకడు తీసి దాస్తాడు. పెన్సిలొకడు కాజేస్తాడు. గుండీ లొకడు విప్పుకుపోతాడు. మేష్టరుగారు స్కూలుకు బయలుదేరే సమయానికి ఒకటీ కనిపించక విసుక్కొని "వీళ్ళదాడి ఎదుర్కోలేకుండా వున్నాను. చూచిచూచి నామీద గొరిల్లా యుద్ధం సాగిస్తున్నారు మలపలు" అని గోలపెట్టడం మామూలు.

ఒకసారి చుట్టాలింటికి వెళ్ళాను. వాళ్ళదొడ్లో పెరుగు తోటకూర మడిలో మేకలు పడి మొదలంటా కొరికివేసినాయట....ఆ గృహస్థు యెంతో బాధపడి "పాడుమేక, తోటకూర మడి అంతా మెషన్‌గన్ చేసిపారేసింది" అన్నాడు.

ప్రతిరోజూ శ్రద్ధగా రేడియో వినే ఒక ఇల్లాలు ఆదివారంనాడు భర్తతో సంసార విషయాలనుగురించి సంభాషిస్తూ - ఇలా వార్తాప్రసారం చేసింది. "ఈ వారపు సంగతుల సింహావలోకనం" అని. నేతిచెంబుమీద మొన్నటిదినం పిల్లి పెద్దయెత్తున

పాడిచేసింది. చెంబు వొరిగింది. కాని నేతినష్టంకాలేదు. కనుక ఈ వారం నేతి పరిస్థితిలో ఆందోళన లేదు. కూరల బుట్టలలోకి ఎలుకలు 'పారాచూట్ల'ద్వారా దిగి చాలా నష్టం కలిగించాయి. కనుక వాటిమీద గట్టిదెబ్బ తీయాలి.... మళ్ళీ కూరలు తెచ్చుకోవాలి"—

"అన్నట్లు మా ఇంట్లో పనిచేసే మనిషి పాలమనిషి. బహుశ పంచమాంగ దళంగా వ్యవహరిస్తూన్నట్లున్నారు, లేకపోతే మనం తగవులాడామని బయటివారి కెలా తెలుస్తుంది" అని ఒక ఇల్లాలు భర్తతో తన భయం వెల్లడించుకొంది.

బడిలో ప్రతిరోజూ దెబ్బలుతినే కుర్రాణ్ణి చూచి వీధి బడిపంతులన్నాడుట "ఏంలాభం! ఈ వెధవ వీపు 'మాల్టా' అయిపోయింది. వీడికిమాత్రం జ్ఞానంరాలేదు." అని. [మాల్టా ద్వీపంపై అంతులేని విమానదాడులు జరిగినాయి ఆ యుద్ధంలో.]

(1942 నవంబర్ 8)

# 7. పత్రికా విలేఖరులు

మొన్న డాక్టరు పట్టాభిగారు బందరులో ఉపన్యసిస్తూ - పత్రికా విలేఖరులు, వున్నవిషయాలు ఎక్కువచేసి' మార్చి చెపుతూ వుంటారని వారిలో ఇదోరకం జాడ్యం ఏర్పడిందని శెలవిచ్చారు. మరి, దైవవశాత్తు వారానాడు ఇచ్చిన వుపన్యాసాలన్ని పత్రికలకు పంపడంలోనే అలాంటి తమాషాజరిగింది. అదే పత్రికలలో పెద్ద పెద్ద అక్షరాలతో పడిందికూడా.

డాక్టరుగారు అన్నారు - దేశంలో సాంఘిక వైషమ్యాలు పెచ్చుపెరిగినాయి. బొంబాయి, కలకత్తా మొదలైనచోట్ల ఇవి ఉగ్రరూపం దాల్చినవి. ఇంకెన్నిచోట్ల ఇవి అవతరిస్తాయో తెలియదు. కనుక ప్రజలందరూ అప్రమత్తులై వుండాలి, ఆయుధ పాణులై వుండాలి అన్నారు. ఇంకొకచోట వుపన్యాసంలో కమ్యూనిష్టుల విషయం వచ్చింది. దాన్ని టీవినీ గుచ్చెత్తి విలేకరులు - 'కమ్యూనిష్టుల విషయంలో జాగ్రత్త పడాలి ప్రజలు, ఇళ్ళల్లో జాగ్రత్తగా వుండాలి' అంటూ అందచేశారు.

డాక్టరుగారే వారి ఉపన్యాసంలో 'మూడు కాకుల'కథ ఒకటి చెప్పారు. చాలా విచిత్రంగా వుంది. అది చెపుతాను వినండి. ఒకడెవడో డొక్కుంటే, అది విన్నవా డొక పరిచారం చేశాడట - 'ఫలానావా డీరోజున మూడు కాకుల్ని కక్కాడని' - అంతా విని ఆశ్చర్యపోయారట. ఇంకా కొంతసేపటికి వాడే పరుగెత్తుకు వచ్చి - 'మూడు కాకులు కాదుట - వాడు కక్కింది రెండు కాకులే'నని, అన్నాడట - మళ్ళీ ఇంకో గంటకు వచ్చి, 'అబద్ధాలెందుకు, వాడు కక్కింది ఒక్క కాకేనట. లెక్కలలో తప్పు వచ్చిందిట' - అన్నాడు - దానికీ ప్రజలు - 'మనిషేమిటి కాకిని కక్కడమేమిటి' అని ఆశ్చర్యపోతున్నారట. మొదటి పెద్దమనిషి - కాకిని కాదుట కక్కింది, ఏదో నలుపు

పడిందిట కాకిలా' అన్నాడట. తీరా విచారించితే అది పైత్యపు దోకుట - అంతకన్నా ఏమీలేదని అన్నాడట

నిజానికి ఈ పత్రికా విలేఖరుల విషయంలో విచిత్రమైన కథలు చాలా చెప్ప వచ్చును. వాటిలో కొంత హాస్యం, ఆనందం లేకపోలేదు. ఈమధ్యనే ఒక అమెరికన్ పత్రికా విలేకరి రాజగోపాలాచార్యులుగారిని గురించి వ్రాస్తూ - ఆయన గాంధీగారి అల్లుడనీ, చాలా పలుకుబడి గలవాడనీ వ్రాశాడట! ఇలాగే శరచ్చంద్రబోసుగారిని గురించి వ్రాస్తూ - ఈయన బ్రిటిషువారికి పరమశత్రువనీ, ఇదివరలో ఒకటిరెండు సారులు పారిపోయాడనీకూడా వ్రాశాడట. అమెరికను ప్రజానీకానికి ఇలాంటి అసత్యాలు అందిస్తే-ఇక అక్కడ మరి ఎలాంటి ప్రచారం జరుగుతుందోనో భారతదేశాన్ని గూర్చి వేరే చెప్పక్కరలేదు గదా మరి—

అన్నట్టు వెనుక ఒక ఇటాలియన్ పత్రిక మహాత్మా గాంధీజీని గూర్చి వ్రాస్తూ చాలా విచిత్రమైన వర్ణన చేసింది. గాంధీజీ ఒక ప్రఖ్యాతిచెందిన నీగ్రోనాయకుడట. ఆఫ్రికాలో భారతీయుల బానిసత్వం తొలగించడంకోసం ఎంతో కృషి చేశాడట. అంతేకాకుండా ఆయన ఒక భారతవనితను వివాహమాడాడట. ఆయన సేవకు మెచ్చి భారతీయు లాయన్ను తమదేశానికి ఆహ్వానించారట. ఆ, అన్నట్టు రాజగోపాలాచార్యులు గారిని వెనక ఒక పత్రికా విలేకరి గోపాలపుర సంస్థానానికి ఆయన చక్రవర్తి అని వ్రాశాడు.

పత్రికా ప్రపంచంలో పనిచేసేవారిలో నిజానికి కొంత ఊహాశక్తి, కొంత కల్పనా అవసరం. అవి పాఠకుల్ని కొంచెం చక్కలిగింతలు పెడతాయి. అంతమాత్రం చేత కేవలం అబద్ధాలు ఆడటం, ఒకరిని అన్యాయంగా దూషించడం జరుగక్కరలేదు. చూడండి, మొన్న పత్రిక చదువుతూవుంటే, హాలెండుకు ఇటీవల చర్చిల్ మహాశయుడు వచ్చివెళ్ళాడనీ, ఆయన అక్కడ వుండగా కాల్చిపారేసిన చుట్టల మొదళ్లు - ఒక్కొక్కటి 100 రూపాయలకు, 80 రూపాయలకు అమ్ముతున్నారనీ వార్త పడింది. ఆ ఎంగిలి చుట్టలకే అంత విలువ ఉండగాలేంది, ఆయనఅసలు చుట్టకెంత విలువ, ఆయన జీవితాని కెంతవిలువ అని ప్రజలు ఆశ్చర్యపోతారు రాజకీయంగా చూచుకొంటే చర్చిల్ మహాశయుని గౌరవం, ఇంకా విదేశాలలో తగ్గలేదు. ఆయన్ను గౌరవించేవారున్నారని తేలుతుంది. పత్రికా విలేఖరి సృష్టించిన ఈ వార్తలోగల విశేషభావాన్ని కనుగొంటే, అది అసత్యంగాను, అధర్మంగాను వుండదుగదా మరి!

పత్రికా ప్రపంచంలో రాజకీయ వార్తలు, క్షేమ సమాచారాలు, గాలి, ఎండ, వానల కొలతలు, రాకపోకలు ఇవన్నీ ప్రతినిత్యం ప్రత్యక్షమవుతూనే వుంటాయి. ఇవి కాకుండా కొన్ని విచిత్రమైన గాలిపటాలు ఎగరవేస్తే - వాటివెంట కొంతదూరం పరుగెత్తి ఆనందిస్తారుకదా మరి? - అసలు రాజకీయాలలోనుంచి, రాజకీయవేత్తలలో

నుంచి విచిత్రాలనేకం ఏరి వ్రాయవచ్చు. నిజానికి రాజకీయవేత్తలకు - పత్రికా విలేకరులకు ఒక విచిత్రసంబంధం వుంది. చేతిక్రింద అధమం ఒకటి రెండు వార్తాపత్రికలైనా లేందే, నలుగురు విలేకరులను మంచిమాట చేసుకోందే ఎవరూ నాయకులు కాలేరు. తామే వ్యాసాలు వ్రాసి, ప్రోగ్రాములు తయారుచేసి, జీవితచిత్రాలు వ్రాసి, విలేకరుల పేరుతో పత్రికలకు పంపేవా రెందరులేరు దేశంలో! తమకు నచ్చిన వార్తల్ని వేసే విలేకరులకు మంచి ప్రవేశముంటుంది. లేనివారు అసత్యవాదులుగా పరిగణింపబడతారు.

డాక్టరుగారు పత్రికా విలేకరుల నందరినీ ఒక తెగక్రిందకు తేవడం అంగీకరించంగాని, విలేకరులలో అలాటి తెగలు వున్నాయంటే, బావుంటుంది —

# 8. స్నేహం

స్నేహం అనేది చాలా ముఖ్యమైన, ముద్దైన సంబంధం, మానవులకు - ఒక జీవికి కావలసిన, ఆనందం, త్యాగం, ఓదార్పు, నేర్పు, వెలుగూ, వెచ్చదనం - ఇవన్నీ ఉచితంగా దొరికే బజారు స్నేహితుడంటే! - అంటేనేకాదు - స్నేహంలో ఆత్మార్పణంకూడా వున్నది. ప్రక్క హృదయంమీద ఎండపడి వాడకుండా చేయడంలో స్నేహితుని ఎడద, విచ్చిన నెమలి పింఛమై నీడపట్టుతుంది. అవసరమైతే, ఆనందంగా నృత్యంకూడా చేస్తుంది. వెనుకటి పురాణాలలో, చరిత్రలలో స్నేహాన్ని సూచించే అద్భుతమైన సంఘటనలెన్నో మనకు కనిపిస్తాయి.

కాని ఈ రోజుల్లో స్నేహానికి అంత బలం, విలువా కనిపించదు. పైగా ఈ స్నేహాలు త్వరగా చెడిపోవడానికి, ఉన్నశక్తిని పోగొట్టుకోవడానికి తోడ్పడుతున్నాయి. డబ్బు కాస్త వున్నవాడితో ఇంకోడు స్నేహం ప్రారంభించాడంటే - వాణ్ణి ఒక సిగరెట్టుచేసి, తానో అగ్గిపుల్ల అయి, అంటుకోవడం - అది తగలబడుతూవుంటే, కమ్మని పొగ తానుపీల్చి, అది చివరికివచ్చిన తరువాత విసిరి పారెయ్యడం - జరుగుతూ వుంటుంది! అందువల్లనే మన పెద్దవాళ్లు స్నేహాలు అంటే భయపడతారు ఎక్కువగా!

పల్లెటూళ్ళనుంచి పిల్లలు చదువులకు బస్తీలకు వస్తుంటే - అక్కడి పెద్దలంటారు "ఎందుకు పంపుతావు వెంకయ్యా, బస్తీ సావాసాలుచేసి పిల్లలు పాడైపోతారు" అని ఎవరైన ఒకడు స్నేహితుని ఇంటికిపోతే ఆ తండ్రి ఇక గొణుగుడు ప్రారంభించుతాడు - 'ఇదెక్కడి సావాసాలోయి బాబూ, ఈ మోజులోపడి, అన్నం నీళ్లు, ఇల్లు వాకిలీకూడా మరచిపోతున్నాడు - కుచ్చులు కొరికేరకంలోకి మారిందిగాని వాడిపని, ముత్యాల గొడుగులు పట్టేముద్దు కనిపించడంలేదు' - అని. నిజానికి ఈ రోజుల్లో స్నేహం కుదరడంకూడా తేలికే అయింది. పార్కులో ఒకసారి చూస్తే స్నేహం -

ఇక రోడ్డుమీద రెండుసార్లు ఎదురుపడితే స్నేహం! - అసలు స్నేహమనేది ఒక దివ్యానుభూతి అనే విషయం మరచిపోయి, అదో అనుమానానికి, అపహాస్యానికికూడా తోవ అవుతోంది. ఇద్దరు మిత్రులు కలసి హాయిగా తిరుగుతూవుంటే చూచి లోకం ఎన్నివిసురులో విసురుతుంది, ఎంత విడ్డూరాన్నో ప్రకటిస్తుంది -

ఇక మిత్రుల మధ్యగల ప్రేమభావాన్ని వర్ణించాలంటే మరీ విచిత్రంగా వుంటుంది. బయటకు ఎంతో ఆప్యాయత, ఆనందం కనబరుస్తారు - "నీవు లేందే నాకీ ప్రపంచమే లేద"న్నట్లుగా భావప్రకటన చేస్తారు - కాని సమయంవస్తే ఎవరికి వారే యమునాతీరే అయి వూరుకొంటుంది. కొందరి స్నేహాలు ఇళ్ళవద్ద బయలుదేరి, కాఫీహోటల్‌వరకు - అతి విచిత్రంగా ప్రాకివస్తాయి. అక్కడ ఒక ఇడ్లెన్, కాస్త కాఫీ స్వీకరించగానే, - ఆ స్నేహం ఆనాటి కలా విడిచిపోతుంది. కొందరి స్నేహాలు ఏ సినిమా టిక్కెట్టునో ఎదుటివానిచేత కొనిపించేటంతవరకూ వచ్చి, ఆపని అవగానే ఆరోజుకు చల్లారిపోతాయి.

చాలా స్నేహాలు మరి డబ్బుకోసం, అప్పుకోసం బయలుదేరుతాయి - వాడు కొంచెంతడి విదల్చడం మానెయ్యగానే - 'వాడు వట్టిఫూల్' అయిపోతాడు. స్నేహంలో వాడిదగ్గిరనుంచి లాగిన రహస్యాలన్నిటినీ, అడిగినవాడికీ, అడగనివాడికీ చెవులో గరాటుపెట్టి గుమ్మరించడం ప్రారంభమవుతుంది.

మొన్న ఒకాయన బజారులోనుండి వస్తుంటే రెండోవాడు పట్టుకొని గబగబ తిట్టడం సాగించాడు. ప్రక్కనున్న ఆయన 'అదేమిటయ్యా అలా తిడుతున్నాడు, ఉత్తపుణ్యానికి' అంటే - 'వాడు మా ఫ్రెండులెండి - ఎప్పుడూ అంతే, పిచ్చిసన్యాసి, నన్ను తిట్టడం వాడికి సరదా' - అని చక్కాపోయాడు.

వెనుకటికి ఇద్దరు స్నేహితులుండేవారు - ఒకడు చాలా బలంగలవాడు, రెండవ వాడు చాలా పీల. ఈ ఇద్దరుకలసి ఒకరోజున రోడ్డువెంట నడుస్తున్నారు. ఆ లావాటి వాడు హఠాత్తుగా రెండవవాణ్ణి ఒక్క చెంపకాయ కొట్టాడు - పీలవాడు దవడపట్టు కొని ఒక్కసారి తేరిపారచూసి, 'నువ్వు హాస్యానికి కొట్టావా? నిజంగా కొట్టాలని కొట్టావా?' అన్నాడు. రెండోవాడు 'నిజంగానే కొట్టాన'న్నాడు. దెబ్బ తిన్నవాడు ఆలోచించకుండా 'అంతే అలాగే చెయ్యాలి. అసలు నాదగ్గిర హాస్యాలు పనికిరావు' అన్నాడట!

స్నేహితుల మనుకొనేవాళ్ళు ముగ్గు రొకచోట కూర్చొని మాట్లాడి పోతూ వుంటారనుకోండి. అందులో ఇద్దరు ఒకవైపుకు వెళ్ళారంటే మూడోవాడికి అను మానమే. వాళ్ళు తనమీద ఏవో చెప్పుకొంటున్నారని, అసలు జరిగేదికూడా అంతే - ఆ రోజుకి ఈ చీలిపోయినవాడిలో అందులో వాడు కలిశాడంటే - మూడోవాడిపని ఆ రోజున అయిందన్నమాటే! స్నేహాలనేవి - ఇలాంటి గారడీకీ, డొల్లుపుచ్చకాయ తంతుకే పనికివస్తున్నాయి ఈ రోజుల్లో.

తన మిత్రుణ్ణిగూర్చి ఎవరైనా తేలికగా, హాస్యంగా మాట్లాడుతున్నాడంటే తన్వేడు మరమరాలు గుర్రిమ్మరించినట్లు నవ్వుకొని సంతోషించడమేగాని - వడ్లగింజ నూగు గుచ్చుకొన్నంత బాధఅయినా పడటం, ఏ అల్పజంతువుకోవుండే విశ్వాసాన్న యినా చూపించడం మృగ్యం. (1945 అక్టోబర్ 6)

# 9. భార్య ఎలావుండాలి!

చాలామందికి 'ఆడవాళ్ళు ఎలావుంటే అందంగా వుంటారు?' అనే విషయం మీద భేదాభిప్రాయాలుంటాయి. పదిమంది పిల్లల్నికని, ఒకరికి చొక్కా ఇస్తూ, ఒక రికి ముక్కు తుడుస్తూ, ఒకరికి బిస్కెట్ ముక్కలు తినిపిస్తూ, ఒకడికి పాఠంచెపుతూ కూర్చుండే ఇల్లాలు వుంటే-ఇల్లూ నిండుగా వుంటుంది-కళ్ళు చల్లగా వుంటాయని కొందరి అభిప్రాయం.

'ఛీ! ఛీ! పిల్లలేమిటి నించోనివ్వరు....కూర్చోనివ్వరు, నిద్రపోనివ్వరు-నీరు త్రాగనివ్వరు-ఆయనతో మాట్లాడనివ్వరు .... మనస్సువిప్పి మాట్లాడనివ్వరు-ఎందు కొచ్చిన సంతానంబాబూ....హాయిగా భార్యాభర్తలిద్దరూ, నల్లపిల్లీ, తెల్లపిల్లీలాగా చప్పుడుకాకుండా ఇంట్లో తిరుగుతూ కాలక్షేపంచెయ్యవచ్చు'-అని కొందరి అభిప్రాయం.

'సంతానం వుండడం, వుండకపోవడమనేది భగవంతుని దయకు సంబంధించిన విషయం-దాన్ని లెక్కలోకి తీసుకొంటే ఎలా!

కులంయింటిపిల్ల దొరికితే జీవితం జలంమీది కమలంలాగా కదిలి గంతులు వేస్తుంది-అంటారు మరికొందరు.

ఇంకా కొందరు ఈ అన్నిటినీ గడిచి ముందుకు పరుగెత్తి-అందం వున్నా లేక పోయినా ఫర్వాలేదు. ఉడుంలాంటి ఆడది యింట్లోవుంటే-కుడుంతిని నీళ్ళు త్రాగి నంత బలంగావుంటుంది-అనే భావాన్ని వెలిబుచ్చుతారు! అర్ధరాత్రివేళ పదిమంది బంధువులు వచ్చినా వండి వార్చగల దిటవు వుండాలి. ఇంకా అవసరమైతే ఇరసవొడ్లు ఒక్కచేత్తో పోటువేసే ఓపిక వుండాలి-అని కొందరి వ్యక్తుల అభిమతం. ఈ రోజుల్లో యువకులు కోరేది-గుడ్లు లోపలికి పోయినా కొంచెం ఇంగ్లీషు చదువగలిగి వుండాలి. ఓపిక తక్కువైనా లోలాకులు కదలిస్తూనైనా కొంచెం సంగీతం పాడడం అవసరం.

మొన్న ఒక యువకుడు అన్నాడు-'అందంవుంటేనేం, లేకపోతేనేం, చదు వుంటేనేం, లేకపోతేనేం-చిలిపి లేడిలాగా చిందులు తొక్కుతూ వెంటపడి వచ్చే పిల్ల దొరికితేచాలు....ఎంతైనా పరుగులుతీయవచ్చు జీవితంలో'-అని. కొంచెం కళాపిపాస గల వ్యక్తి అనుకొంటాడు. భార్య అన్నందుకు, తమతోపాటు పిట్టగామారి కవిత్వ

సీమల్లో విహరించేట్లుండాలనీ-తానొక భావం వెలిబుచ్చగానే ఆమె దానినందుకొని ప్రకృతి చివరలవరకూ పరుగులు తీయాలనీ అనుకొంటాడు.

మల్లినాథసూరిగారంటూ వుంటారు-'ఏది ఎలావున్నా భర్త ఆకలిని గ్రహించి, ఏ రొట్టిముక్కో, గట్టిపకోడీలో చేసిపెట్టేదై వుండాలి. మన ఆకలి ఆమె గ్రహిస్తే-ఆమె మనస్సు మనం గ్రహిస్తాం అలాగ్గా-అన్నారాయన.

వ్యాపారస్థులు పిల్లను చూడబోయినప్పుడు 'రూపాయి చిల్లర లెక్కపెట్టడం-అప్పుఅడిగినవాళ్ళను చెప్పుదెబ్బకొట్టడం చేతనైనపిల్ల దొరికితేచాలు'-అనుకొంటారు.

విశ్వబ్రాహ్మణులు సంబంధానికి బయలుదేరేటప్పుడనుకొంటూ వుంటారు-"నేను వెండి సాపు చేస్తుంటే వెనుకనుంచి కుంపటి వూదే ఆమె అయితే అదేపదివేలు" అని. ఇలాగ వివిధ వృత్తులవారు తమ వృత్తికి దోహదమిచ్చే భార్య చిక్కితే భగవంతునికి మొక్కుతామనుకొంటారు.

భార్య తనకంటె అందకత్తె, విద్యావతి కాకూడదనే ఈర్ష్య చాలామందికి వుంటుంది. పురుషుడిదే పైచేయిగా వుండాలనే వేదాంతం పట్టుకొని వ్రేలాడుతారీ పెద్దమనుష్యులు....మా మిత్రుడొకాయన అన్నాడు-'మా అత్తగారు కన్న సంతానంలో మా ఆవిడ అందగత్తె-తనదే తృప్తీ ఆనందం-అని హృదయాన్ని ఎంతో సమాధాన పరచుకొంటూవుంటారు. సినిమాలకు ఎక్కువగా వెళ్ళేవాళ్ళు-దేవికారాణి, కననన్ బాలల వంటివారిని పెళ్ళాడితే జీవితం హాయిగాగడపవచ్చునని ఆశపడుతూ వుంటారు. చరిత్రాభిమానులు ఝాన్సీలక్ష్మీబాయి, చాందుబీబీ, రుద్రమదేవిలాంటి వారు కావాలని కోరుతారు.

అన్నట్టూ ఈ మధ్య ఒక కాంగ్రెసు యువకుడు బయలుదేరాడు-తాను దేశ స్వాతంత్ర్యం సంపాదించడంకోసం ఒక సూత్రం కనిపెట్టాడుట. దానికొరకు తాను భారత రాజకీయ వేత్తలలో ఎవరి కుమార్తెనైనా పెండ్లాడతలచాడట. అలా ఒక నాయకుడు ముందుకు వస్తే తన కుమార్తెను సమర్పిస్తాడనే ఆశతో ఆ తరుణం కోసం ఎదురు చూస్తున్నాడట. ఆ విధంగా నాయకులందరికీ వుత్తరాలు వ్రాశాడుట.

మొన్న ఒక యువకుడన్నాడు-'నేను పెళ్ళాడతలచిన కన్య ఇలావుండాలి, అలా వుండాలి-అని చెప్పలేదు. కాని ఈనాడు భావకవులు తమ కవిత్వంలో సృష్టించుకొని ఆరాధించే నాయికవలె వుండాలి'-అని. మరి ఆ నాయిక స్వరూపాన్ని వర్ణించడమంటే కష్టమేగాని, ఆమె అనేకమంది కవుల హృదయాలను మండే దాలిగుంటలు మాత్రం చేస్తున్నది.

ఆమెది ఏ కులమో, ఏ గోత్రమో, ఎంత వయస్సో, ఏరంగో, ఎలా నడుస్తుందో, ఎలా పాడుతుందో, మగవాడంటే ఎలాటి అభిమానం వుందో ఎక్కడా

వ్రాయబడి వుండలేదు. పైగా అలా వుపాసించే మగువకు సంతానం వున్నట్లు ఎక్కడా చెప్పబడలేదు. ఎప్పుడూ ప్రత్యక్షంగాని అలాటి స్వప్నసుందరిని ఆరాధించడంలో కొంత భేదంవున్నా-ప్రతిబంధకాలు లేవంటాడామిత్రుడు.

అసలు- వెన్నెలా, పువ్వులు, సువాసన. లేడి చూపులు, సెలయేటి పరుగులు, వీణాస్వరం-ఇవన్నీ కలిస్తే స్త్రీ అవుతుంది-స్త్రీలో ఇవన్నీ వుండాలి నిజానికి.

# 10. పిల్లలున్నవాళ్ళ తిప్పలు

పిల్లలు లేనివాళ్ళు పడే తిప్పలవిషయం విని మల్లినాధసూరిగారిలా అన్నారు - 'పిల్లలున్న మాబోటివాళ్ళు పడే తిప్పలు అనేకంవుండగా వాటి నన్నిటినీ వదిలి - లేని వాళ్ళ విషయం ముందు వ్రాశారెందుకండీ' అని. వారికి ఎక్కడ కోపం వస్తుందోనని ఈసారి - కడుపు రాజనాల పంటపండిన వారి జీవితవిశేషాలు కొన్నింటిని వివరిస్తాను.

మల్లినాధసూరిగారే ఒకసారి అన్నారు-'ఈ సంసారం, ఈ జింజుకానావల్ల నాకు కనిపించే ఆనందం ఏమీలేదు. మా మామగారు బారసాల పీటలమీద మోజుకొద్దీ చదివించే ఖద్దరు రెక్కచాపు ఆశ ఒక్కటితప్ప....,నిజమే మరి సంసారపక్షంగా ఆలోచిస్తే, నలుగురు పుట్టినప్పటినుంచి సాకుకురావడం ఎంతశ్రమో అవుతుంది తల్లిదండ్రులకు. ఇక 'ప్రభవన్' పెద్దవాడిపేరు ప్రారంభిస్తే, ఏ 'దుందుభి' అని చివర పిల్లకు పేరు పెట్టతగిన సంసారాలసంగతి చెప్పనే అక్కర్లేదు.

అన్నట్టు మొన్న ఒక పెద్దమనిషి అరపరక మామిడిపళ్ళు కొని వెళ్తూ అర్ధరాత్రి దాకా మా యింట్లోనే కూర్చున్నాడు. 'ఇదేమిటి స్వామీ ఇంటికి వెళ్ళండి, పిల్లలు నిద్రపోతారేమో పాపం!' అన్నాను. 'ఆ! అప్పుడే నిద్రపోరండీ! అందుకనే ఇక్కడ కూర్చున్నా. అడక్కఅడక్క ఇవ్వాళ మా ఆవిడ మామిడిపళ్లు అడిగింది. అందుకని ఈ అరపరకా కొన్నా. ఇంటికిపోతే దానినోట్లో పడనివ్వరనే భయంతో - పిల్లల నిద్రవేళ దాటించి పోదామని ఇక్కడ కూర్చున్నా. నిజంచెపితే నమ్మతారో, లేదోగాని - పరకమామిడిపళ్లు కొనుక్కుపోయి, పిల్లలందరికీ తలొకటీ ఇస్తే - చివరికి నేను మా ఆవిడా గడ్డాలు చీక్కోవాలి. ఇలాటి సంసారాలు మావి! ఏం చెయ్యమంటారు మా అవస్థ!' అన్నాడు

వెనుకటికి ఈవినింగ్ బజారులోకి ఒక టైంపీస్ వచ్చింది. ప్రక్కనున్న మాష్టార్ని 'ఏమండీ మీరు తీసుకొంటారా పోనీ' అన్నాను. ఆయన నావంక తేరిపారి చూచి 'మాకు అలారం దేనికండీ! ఇది అరగంటలు కొడుతుంది....గంటలు కొడు

తుంది ...అంతే! మా ఇంట్లో పావుగంట కొకటిచొప్పున కొట్టే సైంపీసులున్నాయి. 'కీ' ఇవ్వవలసిన అవసరంకూడా లేదు ఆపడం అవస్థగాని' - అన్నారు.

ఈ విషయం పల్లినాథులతో చెపితే - వారు తమ అవస్థ నీక్రిందివిధంగా ఎంతో విపులంగా చెప్పారు.

ఒక్కొక్కళ్ళనే భుజాలమీద వేసుకొని 'గోవిందరామ్! గోపాలరామ్!' అంటూ నిద్రకొట్టేటప్పటికి పదకొండు అవుతుంది. అప్పుడు దుప్పటిదులిపి దిండుసర్దడం. మాగన్నుగా నిద్రపట్టేవేళకు అంటే వంటిగంటకు - మా పెద్దవాడులేచి ఒక వేలు చూపిస్తాడు. వాణ్ణి నాలుగుతిట్టి మంచందింపి మళ్ళీ తీసుకువచ్చి పడుకోబెట్టి ఇలా కళ్లు మూసుకొనేసరికి రెండోకుంక లేచి రెండువేళ్లు చూపిస్తాడు. 'ఓరి దరిద్రుడా!' అని వాణ్ణి తిట్టి, వాణ్ణి కన్నందుకు వాళ్ళ అమ్మను తిట్టి - దీపపుబుడ్డి వెలిగించి - మేడ మెట్లన్నీ దింపి క్రిందకు తీసుకొనిపోయి తీసుకొని - మళ్ళీ పక్క దులుపుకొంటాను.

'ఇలాగే మూడవవాడు మూడింటికి మూడువేళ్లు, నాలుగోవాడు నాలుగింటికి నాలుగువేళ్లు, అయిదోవాడు అయిదింటికి అయిదువేళ్లు చూపిస్తుంటారు.' ఇంతలో మా ఆవిడ 'లేవండి! కచ్చికా, తాటాకు తెచ్చాననడం—నేను ఉలిక్కిపడి లేవడం మళ్ళీ నా కుంటిగుర్రాన్ని తోక మెలిపెట్టి ఆఫీసుకు తోలడం—ఇదీ అవస్థ!' అని ఆయన వర్ణించారు.

ఒకావిడ పాపం పదిమంది పిల్లల్ని సరిగ్గా సాకుకోలేక నానాఅవస్థలు పడుతూ, 'నేనేం ఈ సంతానాన్ని కోరానా!....తపించానా? భగవంతుడు నా రోగం ఇలా కుదర్చాలని కుదిర్చాడుగాని'—అని అంటే—భర్త ఆ మాటలందుకొని 'గారడీవాడు బుట్టక్రింద మామిడిటెంకను మొలిపించి, నిముషంలో పూయించి, మనచేత పండ్లు తినిపించిన తంతుగావుందే మన కథఅంతా' అన్నాడు.

ఒక ఇల్లాలికి వరుసగా అయిదుగురు మొగపిల్లలు ఒకటే పోలికవాళ్లు పుట్టుకు వచ్చారుట. ఆమె వాళ్ళను వెంటవేసుకొని పెళ్ళిళ్ళకు అక్కడకూ వెళ్ళినపుడు అక్కడి వాళ్ళు వాళ్ళను వేరువేరుగా గుర్తుపట్టలేక 'వాడు ఎన్నోవాడమ్మా? వీడూ!' అని అడగడం ప్రారంభించితే—ఆవిడకు వళ్ళుమండి 'ఎన్నోవాడయితే ఏమండీ! అంతా మావాళ్ళే! అరటిగెలకు ఇన్నోకాయ, అన్నోకాయ అని లెక్కవుంటుందేమిటి!— అని విసుక్కొనేదట పాపం.

ఇంటికి వచ్చినతర్వాత ఆ మాట భర్తతోచెప్పి, 'చూడండి! మన పిల్లలకు వయస్సూవారా ఆట్టే లేకపోవడం—అందరూ ఒక్కటే పోలికగా వుండడం పెద్ద చిక్కుగా వున్నదండీ'—అని దిగులుపడేదిట.

ఏదో ఒక పాపడు పాలబుగ్గల్లో పసిడికాంతులు విరాజిమ్ముతూ 'నాన్నా నాన్నా'

అంటే నాకాసికి మెట్లు కట్టుకున్నట్లవుతుందని కొందరు ఆశపడుతుంటే—'నాకీ సంతానం దేనికి పర్భిఖా, కంటికి కమ్మటి కునుకులేకుండా' అని కొందరు గోలపెడుతూవుంటారు.

ఎవరేమన్నా—ఈ రత్నాలపంట ఎవరు కోరితేనూ, కొంటేనూ వచ్చేదా?....

( 1948 ఏప్రియల్ 14 )

# 11. ఆవకాయపాట

మొన్న మా అరుగుమీద ఒక అతను కూర్చుని రామదాసు కీర్తనలు పాడుతున్నాడు. రామదాసుగారు ముక్తి పొందడం మాట అలావుంచి లేనిపోని గొడవ నెత్తినెత్తుకొని పడ్డ అవస్థలు వింటుంటే—ఎంతో బాధ అనిపిస్తోంది.

తన భార్యకో చీర కొన్నాడా! నగ చేయించాడా! కడుపునిండా అన్నం తిన్నాడా!—ఏమీలేకుండా అంతా భద్రాద్రిరామునికి సమర్పించి మళ్ళీ ఆయన దగ్గిర వసూలు చేసేదాకా—ఒక అవస్థ అయిందాయనకు. మధ్య జామీనుండి ఏ బ్యాంకులోనో అప్పులిప్పించినవారిబాధ రామదాసు బాధకంటె వేయిరెట్లు అధికం. కొన్నాళ్ళు ఏడిపించి అయినా రాములవారు టకీ యిచ్చేశారు. కాని ఈ జామీనుదార్లు పదిమంది రామదాసులంత బాధపడి చివరకు తామే ఏ ఇల్లో....అమ్మి చెల్లించుకోవాలా అప్పు.

అయితే రామదాసుకి లేని వీలు ఒకటి వుందివీరికి. కొన్నాళ్ళు ఆలోచించి, దివాలా పిటీషన్ దాఖలు చేయవచ్చు. ఈ రామదాసులనాటి కాలంలో ఇది చివరిసీను. రామదాసు తానీషా సొమ్ము కాజేసి జైలులో పడ్డాడు. ఎంతో బాధ పడ్డాడా చీకటి గదిలో. కాని నెలనెలా అద్దెకట్టి ఇరుకు కొంపల్లో ఇంటిల్లపాటీ బందిఖానాలో లాగా పడే అవస్థలు చూస్తే రామదాసుగారి పనే తేలిక అనిపిస్తుంది.

నేనెరుగున్నవారు ఒకరు ఇలాటి ఇరుకుకొంపలో వుండి, తెల్లవార్లు గాలిలేక, వెలుగులేక, పిల్లలు లేచి కూర్చుని ఏడుస్తుంటే—భార్య పరిస్థితులుచూచి భరించలేక భర్తతో ఇలా నివేదించుకొంటుంది.

"ఎందుకు కుదిర్చావయ్యా....ఈ పాడుకొంప....పడలేను బాధ....అబ్బబ్బ.... బాధ..." అని చేసే గోల రామదాసు కీర్తనలలో భావానికీ, రాగానికీ, తాళానికీ, ఏమాత్రం తీసిపోవు.

ప్రపంచంలో ఇంకోరకమైన రామదాసులుంటారు. అయితే వీరి భక్తివేరు,—ఆరాధనా దైవం వేరు. వయస్సూ, సొమ్మూవున్న సమయంలో ఒకవేశ్యను ప్రేమించి ఆ రూపములో, కులుకులో ఏదో మహత్తర భాగ్యాన్ని దర్శించి—తన సొమ్మంతా ఆమెకు సమర్పించడం, ఆమెకో ఆలయం—ఆనంద నిలయం—కట్టించడం—తర్వాత ఆమె అతనికి ముక్తిమార్గం చెప్పడం జరుగుతుంది. వెంటనే వీధులవెంట రామదాసు

భజన బృందంతో సెమ్మా పుచ్చుకొని, బయలుదేరి-స్వీయగాధ గానంచేస్తూ విహరిస్తూ వుంటారు వీరు. కాని, వారిపేర ఒక ఆలయం, ఒక దేవత అక్కడ నిత్యయాత్రికులు ఏర్పడి పోతారు కలకాలం.

అన్నట్టు మల్లినాథ సూరిగారు ఇటీవల పెళ్ళికి వెళ్ళివచ్చారు. ఆ నెలలోనే ఆవ కాయ, మాగాయకూడా పెట్టించారు. ఖర్చు చాలా అయింది. అప్పుడు వారు కట్టి పాడినపాట....

"మున్నాళ్ళ పెళ్ళికి ముప్ఫయ్యి వదిలాయి రామచంద్రా ॥
రైలువాడికి ఇస్తి రానూపోనూ ఇరవై ॥ రామ ॥
పెట్టికూలికి పోయె పైనొక్కరూపాయి
బండ్లవాళ్ళకు ఇస్తి పద్నాలుగణాలు ॥ రామ ॥
ఇంటావిడకు కుట్టిస్తి వంటిమెడ రెవిక ॥ రామ ॥
ఒక్కరెవికకి పట్టె రొక్కమ్ము రెండు....
కుట్టు వాడికి ఇస్తి గట్టిగా బేడాను ॥ రామచంద్రా ॥
ఫేషన్ అనుకొని పక్కనున్న ఆమె
టిక్కెట్టు నేకొంటి రామచంద్రా
టిక్కెట్టుకే పట్టె జాకెట్టు ఖరీదు ॥ రామ ॥
ఆవకాయకు అయేనా అరవయ్యి రూకలు ॥ రామ ॥
మాగాయకు పట్టె మరి ఇరవై రూకలు ॥ రామ ॥
లక్ష్మయ్యకే ఇస్తి సాక్షాత్తు యాభయ్యి ॥ రామ ॥
కారమూ, ఉప్పును ఇంట్లోనే కొట్టిస్తి ॥ రామ ॥
కాయలు స్వయముగా
చేయి చేసి తరిగితి ॥ రామ ॥
ఇంత చేసిన పిదప ఎవడో చుట్టమువచ్చి
వట్టిగా తినిపోవు ఎవడబ్బ సొమ్మని ॥ రామ ॥
కొట్టులోపల అప్పు జోకొట్టితే పోవునా ॥ రామ ॥"

"ఏమండీ! మల్లినాథులూ ఇంత ఖర్చు అవస్థా వుంటే ఎలాకాలం గడిపేది? దీనికేమైనా ముక్తిమార్గం ఆలోచించడం మంచిది. ఈ సంసారాన్ని, ప్రేమనూ, జింజుకానాను వదిలితే సుఖమున్నదేమోనంటే-వారిలా సెలవిచ్చారు. "మీరు బలే వారండీ! ఉన్న సుఖాన్ని కూడా పోగొట్టుకోమన్నారా! ఇల్లు వదిలితే ఎవరండీ ఆదరించేది? ఇలాగే అవస్థ పడుతూ వుంటాం. ఇప్పుడు సన్యాసం పుచ్చుకోమంటే నా తరమా!"

అయినా 365 ఇళ్ళు మాట్లాడిపెట్టండి. అలాగే సన్యాసం పుచ్చుకొంటాను.

ధర్మంబోధిస్తూపోతే, మనకు సమర్పించే వస్తువుల ధర అడగనే అడగరు— అన్నారు.

అయితే ఇకముందు వారు సంసారకూపంలో మునిగిపోకుండా, జీవితాన్ని సాధ్యమైనంతవరకు ఇంటిబయటనే గడుపుతూ—లోకంలోని రుచులను గ్రహిస్తూ వుంటారుట. ప్రస్తుతం వారు విల్సు సిగరెట్టులోని మజా కనిపెడుతున్నారు.

(1944 డిశంబర్ 28)

# 12. పాపం! స్థూలకాయులు

భగవంతు దేవుద్దేశ్యంతో స్థూలకాయుల్ని సృష్టిస్తాడో తెలుసుకోకుండా వారిని హాస్యం చేయడం తప్పుకదూ! పాపం బానలలాటి కడుపులతో కదలలేక మెదలలేక చూడితాబేళ్ళులాగా నాముకుంటూ నడుస్తుంటే—'అయ్యో సోదరా' అని చెయ్యి ఆసర ఇచ్చేవారొక్కరూ కనిపించకపోగా — బొండాంగాళ్ళు, బొగ్గుబస్సు, రోడ్డురోలర్, వాగెన్—అని అనేకవిధాలుగా వారిని ఉడికించడం న్యాయమా!

తప్పనిసరిగా ఏదో పని నెత్తిన పెట్టుకొని బయటికి పోవలసివస్తే పాపంవారు శరీరాన్ని మోసే శ్రమకన్నా, ప్రజలుచేసే అల్లరి భరించడ మనే బాధపడడం అధిక మవుతుంది. ఇక కర్మం చాలక వీరు బస్సు ప్రయాణానికో, పంక్తి భోజనానికో బయలుదేరారంటే చెప్పనక్కరేలేదు వారి తిప్పలు.

ఒక స్థూలకాయుడు బస్సులో ఎక్కగానే-ప్రక్క ప్రయాణికుడు కండక్టరుని అడిగాడుట-"ఏమయ్యా! ఎన్ని సీటరు బస్సు యిది? అని. అతదేదో నెంబరు చెప్పాడు. "మరి ఈ సీటు నాకూ ఈయనకే సరిపోవడంలేదు. అంతమంది ఎక్కడ కూర్చుంటారు! ఈ సారి ఇన్‌స్పెక్షనుకు వెళ్ళేటప్పుడు ఈయన్ని శాంపుల్‌గా తీసుకు పోయి సీట్లు నిర్ణయించుకో," అన్నాడుట. ఆ స్థూలకాయుడు చిన్నపుచ్చుకోక ఏం చేస్తాడు!

ఇటీవల నేను ఊరునుంచి వస్తుంటే లావుపాటి వాళ్ళకే లావు అనిపించే ఒక ఆయన కబంధుడు లాగా రోడ్డు ప్రక్క నిలబడి గొడుగు పైకెత్తాడు. కండక్టరు ఆయన్ని చూచి డ్రైవరుతో అన్నాడు. "ఆయన్ని బస్సులో ఎక్కిస్తే ఆరుగుర్ని దించాలి. ఆపకు పోనీ"అని. అయినా డ్రైవరు బస్సు ఆపాడు. ఆ స్థూల కాయుడు శరీరాన్ని బస్సులో వేయాలని దగ్గరికి వచ్చాడు ఆయాసపడుతూ....

డ్రైవరు అన్నాడు ఎంతో సీరియస్‌గా-"చూడండి బాబూ....బస్సులో మీకు సీటు దొరకదు కాని ఒక్క చిన్నమాట చెప్పండి" అన్నాడు. పాపం ఆయన ఎంతో

నిరుత్సాహపడి "చాలా అర్జంటుపని" అన్నాడు. "అర్జంటు అయితేమా తం బస్సు నడవ వద్దు? నాక్కావలసింది మీరు ఏ ఫ్యాక్టరీలో బియ్యం తింటున్నారనేదే....దయవుంచి కొంచెం చెప్పండి—మా వాడొకడున్నాడు—బొత్తిగా చిక్కిపోతున్నాడు. వాణ్ణి బొద్దుగా తయారుచెయ్యాలి. మీరు ఫ్యాక్టరీ పేరు చెపితే ఒక పావుబస్తా బియ్యం తెచ్చిపడేస్తా—మీకెంతన్నా పుణ్యం వుంటుంది" అన్నాడు. బస్సులోవాళ్ళంతా పగలబడినవ్వారు.

వెనుకటికి ఒక స్థూలకాయుడైన కవి వర్యుడు మిత్రుడి ఇంటికి వెళ్ళాడుట. తీరా వెడితే ఆ గృహస్థు వూళ్ళోలేడు. ఆ మిత్రుని భార్య నిండుచూలాలు. భర్తగారి మిత్రుడు వచ్చాడని అలాగే పిండివంటలతో సహా భోజనం పెట్టడం ప్రారంభించిందట.

కవిగారు తిష్ఠవేశారు. ఎన్నాళ్ళకూ కదలటంలేదు. ఆమెకు విసుగు పుట్టింది. చివరకు ఎలాగో బయలుదేరాడు. ఆవిడతో "వెళ్ళొస్తానమ్మా" అన్నాడుట. ఆవిడ "అయ్యో! అప్పుడే వెళ్ళిపోతారా! నాతోపాటు చెంబెడు నీళ్ళు పోసుకు పోతారను కున్నానే" అన్నదట.

ఒక పెద్దమనిషి బస్తీకి వెళ్ళి భోజనానికి హోటల్‌కి వెళ్ళాడుట. ఒక టిక్కెట్టు భోజనం ఏ మూలకని నాలుగు టిక్కెట్లు కొని భోజనం ప్రారంభించాడు. ఎంత వడ్డించినా ఊదిపారేస్తున్నాడు. హోటల్ వాడి గుడ్లు తిరిగిపోయినాయి. అతడు భోజనం చేసి లేవగానే అన్నాడుట—"బాబూ! మీ భోజనం అయిందిగా. దయవుంచి తక్కిన వాళ్ళను ముగ్గురిని రాకుండా చెయ్యండి. ఆ టిక్కెట్లడబ్బు వాపసు ఇస్తాను"అని. ఈ ఎత్తు బాగానే వున్నదని తలవూచి తక్కిన టిక్కెట్ల డబ్బు వసూలు చేసుకొని ఆయన త్రేపుతూ వెళ్ళిపోయాడుట.

వెనుక జొన్నవిత్తుల కుటుంబ సుబ్బారావుగారు నెల్లూరు జైలులో ఉన్నప్పుడు జైలు సూపరింటెండెంటుతో అన్నారుట....'అయ్యో! నా తూకం 240 పౌన్లు. మామూలు ఖైదీలకిచ్చే అన్నంముద్ద నాకేం చాలుతుంది? నాకు రెండు ముద్దలిప్పించాలి' అని. సూపరింటెండెంటు అన్నాడు "నువ్వు రైల్లో సింగిల్ టికెట్టుమీద ప్రయాణంచేస్తావా!.... లేకపోతే రైల్వేవాళ్ళు డబుల్ టిక్కెట్టు ఛార్జీ చేస్తారా? అని. అది విని సుబ్బారావుగారు "నాకు మామూలు దుస్తులు చాలక పోతే డబుల్ పన్నాబట్ట తెప్పించి దుస్తులు కుట్టించారా లేదా? దుస్తులు డబుల్‌చేసినప్పుడు అన్నంముద్ద ఎందుకు చేయకూడదు?" అని గట్టిగా వాదించేసరికి జైలు అధికారి నిరుత్తరుడై డబుల్ ముద్ద శాంక్షన్ చేశాడుట.

డానియల్ లాంబర్టు అనే ఆయన 1770 ప్రాంతంలో లెసెస్టర్‌లో జన్మించాడు. పదహారు సంవత్సరాలు వచ్చేసరికి కేవలం కాయం పెంచి ప్రపంచ ఖ్యాతి చెందాడు. బరువు 52 స్టోనులుండేది. ఎవరి దిష్టికొట్టిందో ఏమో నలభై ఏళ్ళకంటె ఎక్కువ బ్రతకలేదు. అతని కాఫిన్ తీసుకు పోవడానికి గుమ్మంచాలక ఒక గోడ ప్రత్యేకం పడగొట్టవలసి వచ్చిందిట.

ఒక్కొక్కప్పుడు, పక్షపాతం లేకుండా భార్యా భర్తలిద్దరూ ఒకే రకంగా పెరగడం జరుగుతూ వుంటుంది. అలాటి వారిలో అగ్రతాంబూలం అందుకోతగినవారు వర్త్ దంపతులు. వీరిది బ్రిష్టల్. పెరశి బరువు 86 స్టోనులు.... పెళ్ళి దుస్తులు కుట్టిన దర్జీ అన్నాడు. "వర్త్ లాగూ చొక్కాలకు తెరచాపంత బట్ట కావలసివచ్చింది. అతని కోటు కుట్టడం నా జీవితంలో ఒక క్రతువైంది."

ఆ బొద్దు దంపతులు ముద్దుముద్దుగా జీవితాలు గడుపుతుంటే.... చూడలేక లోకం ఎక్కిరించేదట....'ఇద్దరినీ తగులంగట్టిన బ్రహ్మ నేర్పరిగదా!' అని సంతోషించ కూడదూ!

(1950 జూన్ 18)

# 13. కరణాల పరిభాష

కరణాల భాషలోనుంచి కొన్ని టెక్నిక్ పదాలు తీసుకొని వాటి ప్రయోగాన్ని వివరిస్తాను. గ్రామలెఖ్ఖలలో, దస్తావేజులు వగైరాలలో అనుశ్రుతంగా వచ్చే ఆచారాన్నిబట్టి ఒకేభాష వాడబడుతూ వుంటుందంతటా. వాటినే కరణాలు కొత్త అర్థాలతో ఎంత సొగసుగా వుపయోగిస్తారో చూడండి.

'ఒరేయ్! మా బావమరిది వట్టి పోరంబోకుగదురా' అంటూ వుంటాడు ప్రక్క ప్రకరణంతో. అంటే అతగాడికి దస్కత్ చేయడంతప్ప ఏమీ చేతకాదనీ,-వాడిబుర్ర వట్టి ఊసరక్షేత్రమని అర్థం. ఒక రివిన్యూ ఇనస్పెక్టరును చూచి ఒక యువకరణం-'హాల్కు నూతనం గాదరా' అన్నాడుట. అంటే ఆ సంవత్సరమే ఉద్యోగంలోకి వచ్చాడనీ, పని బాగా తెలియదనీ అర్థం. [పోరంబోకులు ఆక్రమించుకొని వరిపంట వేస్తూవుంటారు. కరణాలు వాటిని లెక్కల్లో నమోదుచేస్తూ కొత్తసాగు అయితే హాల్కు నూతనమనీ, పాతసాగు అయితే గుజస్తా సాగు అనీ పేర్కొంటారు.]

మరో కరణం 'అబ్బే! ఆయన వట్టి వెట్ పాడీ, జైప్లా ఆఫ్ కెనాల్ వాటర్ గదురా' అన్నాడుట. కరణాలు వ్రాసే అడంగుల లెఖ్ఖలలో పైవాక్యం తరుచుగా దొర్లుతూవుంటుంది. ఏమీ ఆలోచించకుండా, గుడ్డిఎద్దు చేలోపడ్డట్టు తోసుకుపోయే వాడని చెప్పడానికి పైవాక్యం ఉపయోగించాడా కరణం.

వెనుకటి ఈ ప్రాంతంలో 'crop cut' రివిన్యూ ఇనస్పెక్టరుగారని ఒకాయన వుండేవాడట. క్రొత్తసాగులు చేసినవాళ్ళందరూ ఆయన దర్శనం చేసేవాళ్ళు. ఆయన చెయ్యి పచ్చబడగానే-పైరు వున్నాసరే, లేకపోయినాసరే వెంటనే పుస్తకం తీసి 'crop cut' అని వ్రాసేవాడట.

ఒకసారి తహసిల్దారు హఠాత్తుగా వెళ్ళి ఆ పొలం తనఖీ చేశాడుట. పైరు

పకపక నవ్వుతుందట. ఇనస్పెక్టరుగారిని పిలిచి 'ఏమిటి 'crop cut' అని వ్రాశావు. ఆరోజు నీ క్రాపింగ్ ఏమైనా కత్తిరించుకొన్నావా? అని అడిగి మూడునెలలు సస్పెండు చేశాడుట.

దస్తావేజులలో కరణాలు వాడే భాష చాలామందికి తెలుసు. వాటిలోగల హాస్యాన్ని గమనిద్దాం. ఒక కరణంగారు స్నానానికి లేవబోయి భార్యను పిలిచి–సదరు దణ్ణంమీదగల గుజస్తా కొల్లాయి ఇలా పారెయ్యి' అన్నాడుట.

మరొక కరణంగారి భార్య కొంచెం గయ్యాళికాబోలు .... పిల్లల్ని పట్టుకొని కొట్టి విడిచింది. ఇంతలో తండ్రి వచ్చాడెక్కడినుంచో....పిల్లలు చుట్టిముట్టి ఏడ్చారుట. ఆయన భార్యదగ్గిరికి వెళ్ళి గట్టిగా పోట్లాడాడు. ఆవిడ పిల్లలజోక్యం మీకెందుకు వెళ్ళమందిట. 'ఎందుకా! ఒకటి, రెండు, మూడు కుమారులు మైనరులైనందున గార్డియన్ తండ్రి రామకృష్ణయ్యను కాబట్టి' అని గట్టిగా అరిచాడుట.

ఒక కరణం మిత్రుడు నాకో డైరీ ప్రెజెంటు చేశాడు. దానిలో ఇలా వ్రాసివుంది. 'నీ పుత్రపౌత్రపారంపర్యంతం, దానాదమన విక్రయాది సమస్త హక్కులతో బహూకరించబడింది–కాంతారావు–కరణం'.

మరో కరణంగారు నాకిలా చీటీ వ్రాశారు–నా అక్కరనిమిత్తం అనగా చొక్కాలు కుట్టించుకొనే నిమిత్తం మేలువాసి ఖద్దరుగుడ్డ 2 గజాలు–అక్షరాలా రెండు గజములు–ఈ మనిషిద్వారా పంపవలెను. సదరు–పైకం ఇచ్చి పంపుతున్నాను. (ప్రాంశరీ నోట్లు వ్రాయడంలో 'నా అక్కరనిమిత్తం అనగా ఎడ్లను కొనేనిమిత్తం, పాకలేసుకొనే నిమిత్తం, పిల్ల పెళ్ళినిమిత్తం')–ఇలా కరణాలు వ్రాస్తారు. ఇదే నమూనాలో కరణంగారు నాకు వుత్తరం వ్రాశారు.

కరణాలకు వచ్చే జీతాలు తక్కువ. బస్తీలవెంట తిరగడం ఎక్కువ. ఒక కరణంగారిని 'మీ జీతమెంతండీ?' అంటే–'మా పిల్లలకంటె ఒకటి తక్కువ' అన్నాడు. పాపం [ఆ రోజుల్లో కరణాల జీతాలు అయిదు మొదలు పన్నెండుదాకా వుండేవి. అంతకుపూర్వం రూపాయి జీతంమీదకూడా కరణాలు పనిచేసేవారట.]

ఒక కరణంగారిని 'మీ కెందరు పిల్లలంటే' 'పరక మామిడిపండ్లు కొంటే–మూడుపదులకు ఒకటి మిగులుతుంది–అదైనా ప్రస్తుత పరిస్థితి. ముందుసంగతి చెప్పలేం' అన్నాడు.

నౌకర్లమీద కరణాలకు కోపంవస్తే వాణ్ణి తిట్టేతిట్లు ఏమిటో తెలుసా!–క్రాప్ స్టాఫ్‌లాగా ముఖం నువ్వునూ పో అవతలికి, గైరుహాజరు ఘటం–బట్వాడా బడుద్దాయి. ఆ కరణంగారే భార్యను తిట్టవలసివస్తే–'పాత అడంగల్‌లాగా ముఖం

నవ్వాసు గొలుసు (సర్వే గొలుసు) బిళ్ళలా పళ్ల ఇకిలిస్తోంది. ఫో....స్టోన్‌లాగా-అలా నిలబడతావేం' ఇత్యాదులు. వీరిలో హాస్యం వర్ణించాలంటే చాలావుంది.

[క్రాస్ స్టాఫ్....పొలాలు కొలిచేటప్పుడు లైను సూటి చూసేందుకు వుపయోగించే సాధనం అడంగులు-ప్రతి సంవత్సరం సాగు వివరాలు, విస్తీర్ణం తెలియజేసే పుస్తకం.] (1949 మే 24)

# 14. సినిమా పరిభాష

సినిమా కళ ఈ రోజుల్లో చాలామంది ప్రజల్ని ఆకర్షిస్తోంది. ఫిలింతారలకు, టెక్నిక్‌కు సంబంధించిన పరిభాషను నిత్య ప్రసంగంలోకి తీసుకువచ్చి చాకచక్యంగా వాడడం పరిపాటి అయింది. ఆ ఉదాహరణలనిక్కడ కొన్నిటిని పొందుపరుస్తాను.

ఈ రోజుల్లో ఒక స్త్రీ యోధానుయోధురాలని చెప్పవలసివస్తే 'ఆవిడ వాడియా వారి నాడియారా? పాపం ఆ మేష్టారుగారెలా భరిస్తున్నారోగాని-ఆయన జీవితం కేవలం ఒక స్టంటుఫిలిం అయిపోయింది' అంటారు. ఒకరియింటికి ఇల్లరికం వచ్చిన అల్లుణ్ణిగురించి చెప్పాలన్నా, అతడు చేసే విచిత్ర చేష్టలు వర్ణించాలన్నా వెంటనే అంటారు "చూడండిరా ఆ వందేమాతరంగాడి షోకు" అని. అంతకుముందు ఆ అల్లుడు కొంచెం స్థిమితంగా వున్నా....వందేమాతరం పేరు పెట్టగానే అందులో అల్లుణ్ణి మించిన హంగామా చేస్తాడు.

తెలుగులో తీసిన జయప్రద ఫిలింకు జయం లోపించింది. దాన్నిబట్టి ఎవరైనా తాము వెళ్ళినపని కాలేదని చెప్పవలసివస్తే-జయంకాలేదు. జయప్రద అయిందిరా అనడం పరిపాటి అయింది. ఇప్పుడు స్వాములవారెవరైనా కనిపిస్తే....నమస్కరించడం పూజించడం పోయింది. కాషాయ వస్త్రాలవారు కనిపిస్తే చాలు. "మళ్ళీ పెళ్ళిగాడురా" జాగ్రత్తగా కనిపెట్టివుండాలి-అనే అపహాస్యం బయలుదేరింది.

మొన్న నేనొక మిత్రుని యింటికి వెళ్ళాను. వారి యింట్లో అద్దెకువున్న ఆవిడ సంగీతం పాడుతోంది. ఒక యాభైయేళ్ళ స్థూలకాయం ఇంట్లోంచి బయటకువచ్చింది. "ఆ పాడే ఆవిడ ఈయనకే మవుతుందండీ" అన్నాను.... "ఈయన అర్ధాంగే, Unexpected" అన్నాడు. రెండోపెళ్ళి అనడానికి ఆ పర్యాయపదం వినియోగించాడు.

ఒక స్నేహితుని భార్య ఊళ్ళో లేదని తెలిసి భోజనానికి పిలవాలని వెళ్ళాను. అతనితో మాట్లాడుతుండగా లోపల బిందెలు, గిన్నెలు, చప్పుడైనాయి. "మీవాళ్ళు లేరన్నారుగా?" అన్నాను. "మావాళ్ళు కాదు. దేవత" అన్నాడాయన. "ఏమిటి దేవత

అంటున్నారు? దెయ్యాలకొంపా?" అన్నాను. "కాదు వాహినీవారి దేవత" అన్నా డాయన. తీరా చూస్తే అది పనిమనిషి.

"ఒరేయ్! ఈ ఊరి కమీషనర్ వట్టి వినాయక్ గాడురా?" అంటే. తన అందం చందం చూచుకోకుండా లోకానికి వెరవకుండా ఆడవాళ్ళ వెంటపడతాడని అర్థం. ఎవరైనా బిగ్గరగా గొంతెత్తి అరుస్తోంటే "ఎందుకలా గగ్గయ్యలాగా గోల చేస్తావు?'' అని కొందరు అనడం విన్నాను.

"ఒరేయ్ బ్రదర్! నీవేదో ఒక పని తలపెట్టానన్నావుగా - క్రిందటిసారి కని పించినప్పుడు! అది ఏమైంది? అంటే-అదా వట్టి బాలనాగమ్మ అయి ఊరు కొందిరా? ఇప్పుడప్పుడే బయటపడే యోగ్యత లేదు" అని జవాబురావడం విన్నాను.

కొందరి ఇళ్ళల్లో పిల్లలు-వాల్లంతా దుమ్ము చేసుకొని, తలలు విరబోసుకొని రణగొణధ్వని చేస్తూ వుంటారు. అలాటి సంసారాన్ని చూచినప్పుడు ఇతరులు "అబ్బే! వాళ్ళ గుమ్మంలో అడుగుపెడితే అరవ పిక్చరుకు టికెట్టు కొన్నట్టవుతుంది మనపని" అంటారు. ఒక స్త్రీ అందంగావుందని చెప్పాలంటే ఫిలింభాషలో ఇలా వర్ణన ప్రారంభ మవుతుంది. "ఆవిడ కట్ మంచిది. ముఖంలో మంచి యాంగిల్సున్నాయి. ఫ్రేమ్ చాలా నైస్‌గా వస్తూంది. కళ్ళల్లో స్పార్కు వుంది....వగైరా....

ఇటీవల ఒక కళాభాయి ఒక స్త్రీనిచూచి ''ఆవిడ ముఖం టాజ్‌మహల్'' అన్నాడు. అంటే అతని అర్థం ఏ యాంగిల్‌లో ఫొటోతీసినా అందంగా వుంటుందనిట. టెక్నికల్ పదాలు తెలిసీ తెలియకుండా వాడటం విషయం....ఒకాయన తన నూతన మిత్రుడికి పోట్లాట వర్ణిస్తున్నాడు. 'రావడమైతే జోరుగా వచ్చాడు మీదకు-నేను కోపంగా ఉరిమాను. అంతటితో ఆ వెధవ భయపడి ప్లేబాక్ చేశాడు'.

పడుచుతనంతో వున్న భార్యలు ఇంట్లో ఏ ప్రక్కనో నిలబడి రహస్య సల్లా పాలు సాగిస్తూ వుండగా ఏ అత్తగారో ప్రత్యక్షమైతే. ఆ అలికిడికి ముందుగా విన్న వారు 'కట్ కట్' అని దూరంగా పోతారు. 'ఆవిడ నవ్వినా, కులికినా, పలికినా చక్కని ఆర్కెస్ట్రాలాగా ఉంటుంది' అనడం అమల్లోవుందిప్పుడు.

మా లండను శాస్త్రిగారితో నాలుగునిముషాలు మాట్లాడితేచాలు. ఇట్టి ప్రయోగా లెన్ని అయినా బయట పడతాయి. ఉదాహరణకు వినండి-మనం సరి అయిన యాంగిల్‌లో నుంచి చూస్తే మన జీవితంలో టెంపో వుండాలండీ. సెట్టింగ్‌లో ఆర్టి స్టిక్‌గా సృష్టించుకోవడంలో వుందండీ-మన టెక్నిక్ అంతా....లాంగ్‌షాట్‌లో చూచి లాభంలేదు. అంతా క్లోజప్‌లో వుండాలి. క్లోజ్ అప్ అంటే అర్థమైందా!....ఈ విధంగా నడిచేది ఆయనగారి సంభాషణ. ( 1951 ఏప్రియల్ 9 )

# 15. అరలు

'అర' అనేది మనం మామూలుగా వాడేమాట! పూర్ణమైన ఒక అనుభూతిలో నుంచిగాని, ఆహారంలోనుంచిగాని - మరి ఏ యితరంలోనుంచిగాని 'అర'ను స్వీకరించడం ఎంతో సుఖమైన విషయం. చూడండి - 'అర్ధాంగి' అనేది ఎంత తీయని మాట! పూర్ణమైన ఒక యితరస్త్రీకంటె, అర్ధాంగి అయిన స్త్రీలోనుంచి ఎంత సుఖం, శాంతి అనుభవిస్తున్నాడు పురుషుడు? అర్ధాంగిలో మళ్ళీ కొన్ని 'అర'లున్నాయి. అరమోడ్పు కనుదోయి, అరనవ్వు, అరపలుకు, అరకౌగిలి - ఇవి కలిగించే ఆనందం!....

మా బందరు పౌరులకు అరలలోవుండే సొగసు బాగా తెలుసు. కాఫీహోటళ్లలో అరకప్పు కాఫీకంటె ఎక్కువ ఎవరూ తాగరు. ఎక్కువ తాగాలంటే అరకప్పు తర్వాత అరకప్పేగాని ఎక్కువ ఆర్డరివ్వరు. నిండుకప్పులో రుచి వుండదనీ - అథవా వున్నా అందులో నాగరికత వుండదనీ వీరిమతం ఇతర - ప్లేటునిండా టిఫిన్ తిని, కప్పుకాఫీ కడుపులో పోసి కిల్లీ బిరడా వేస్తూవుంటారు. మా వాళ్ళకు ప్లేటు టిఫిన్ మోటు అనిపిస్తోంది. అరప్లేటు ఉప్మా, అరప్లేటు పకోడీ - వీటిలో రుచివున్నదని కనిపెట్టకలిగారు మా పట్టణవాసులు.

ఎంత డబ్బున్నవాళ్ళన్నా - వీశెల లెక్కన ఎవరూ బజారువస్తువులు కొనరు. అరవీశె నెయ్యి, అర్ధశేరు పప్పు, అరబస్తా బొగ్గులు, అరతులం ఇంగువ, అరపౌను కాఫీపొడి - ఇలా కొనడం ఆచారం. సిగరెట్లు వెలిగించి పూర్తిగా నుసిచెయ్యడం అందరికీ అలవాటుకాని మా పట్టణవాసులు - సిగరెట్టును రెండుచేసి, అవుసరమైనప్పుడల్లా ఒకటి పీల్చి అవతల పారెయ్యడంలో దర్జా నాగరికతా వున్నాయని - ఆ పద్ధతి మొదలుపెట్టారు.

మీసం వున్న మగవాళ్ళల్లో వాటిని సగం చేశారు చాలామంది ఎందుకని! అందంకోసం! నిండుమీసం వున్నవాళ్ళను చీంబోతనీ, బొద్దింక అనీ హేళన చేస్తున్నారు. చొక్కా చేతులు సగం పొడవుగా ఎప్పుడో మారినాయి. ఇప్పుడు చొక్కాలే సగంగా అవతరించాయి. సగంకోట్లు వేయడం హుందాతనంగా మారింది.

మాంసాహారుల యింటికి బంధువు లెవరన్నావస్తే 'అరకోడి'తో విందు చేస్తూవుంటారు. అది బంధువులకు మర్యాదను సూచిస్తుంది.

పరీక్ష పేపర్లు దిద్దేటప్పుడు, ఒకటి, రెండు మార్కులు వేసేందుకు చేతులు రావు. 'పోనీ ఒక అరమార్కు తగలేద్దాం!' అనుకొంటూ వుంటారు. బడిపంతుళ్ళకు అరమార్కుమీద అమితమైన అభిమానం.

డాక్టర్లక్కూడా అరలంటే ఎంతో ప్రీతి. ఏం మందిచ్చినాసరే అన్నం తినే ముందు అరగంటకనో, తిన్నతర్వాత అరగంటకనో, నిద్రపోయేముందు అరగంట కనో వేసుకోమ్మని చెపుతూవుంటారు. ఇంజక్షను ఇవ్వవలసివస్తే అరగంట కొకటి పొడిస్తే మంచిదని చెపుతూవుంటారు.

పైనచెప్పిన అరలన్నింటికంటె అందమైంది - ఐశ్వర్యంగలది ఏమిటో తెలుసా! - అర్ధచంద్రుడు. భావకవిత్వం చేప్పేవారికి బాగా తెలుసు - అరలలోవుండే అందం. అందుకనే వారు వ్రాసే గేయాలు 'అర్థకాలం మించవు'. భావాన్నికూడా 'అర' వరకే చెప్పి అలా వదిలిపేస్తారు. గీతాలలో అరపాదం వ్రాసి గీతలుపెట్టి వదిలివేస్తూ వుంటారు. ఒక గీతంలో - అర అక్షరాలు .... అర గీతలు - వుండడం ఎంతో సొగసుంది.

'నేను వెట్టిని — —
నిజము ఆమె లేత — —'

—ఇలాటి అరపదాలలో మజా కనిపిస్తోంది. మొన్న మా లండను శాస్త్రిగారు వ్రాశారొక అసంపూర్తి గేయం.

'నాకు .... నేనే .... వేరేలేరు ....
నాది అసంపూర్తి జీవితం ....
ఒక్కరే వ్రాసి ఆపివేసిన భారతం ....

—ఇలా ఆయనగారి జీవితం, అసంపూర్ణం, అరా అపడంవల్లనే అంత విలువ సంపాదించింది.

పావుల్నిగురించికూడా ఒకటిరెండు విషయాలు... 'పావు పేశాడు' అంటే సిషా అని అర్థం. 'పావుతావు' అంటే ఉద్యోగం స్వస్తి అని అర్థం. ఈ పావులలో, అర లలో వున్నసొగసు, సుఖంలేదు. 'పావు' అంటే 'ట్రాజడీ' - 'అర' అంటే 'కామెడీ' - జీవితంలో 'అరల' సౌఖ్యం అనుభవించినవారికీ వ్యాసం అంకితం. [ 1942 ఆగస్టు 27 ]

# 16. 'ఇదిలో' 'ఆది' వుంది

ఉన్న వస్తువును లేనట్లుగా చెప్పుకొని, ఊహించుకొని ఉసూరుమనడం కొంద రికి అలవాటు-'లేనిది' ఉన్నట్టుగా చెప్పుకొని లేగదూడలాగా గంతులువేస్తూ ఉత్సాహ పడడం కొందరికి సరదా.

అది అలా వుంచండి.... మనం సామాన్యంగా మనది కానిది, దగ్గిర అయిన వస్తువును 'అది' అంటాం. దగ్గిరవున్నదాన్ని 'ఇది' అంటాం. పాపం కొందరు

అమాయకపు ప్రజలు దగ్గరవున్న 'ఇది' నే దూరంగావున్న 'అది' అనుకొని డొక్కలు ఎగరవేస్తారు. మరికొందరు ప్రబుద్ధులు తమకు అందని అందబోని 'అది'ని అందిన 'ఇది'లో చూచుకొని ఎంతో సంతోషంతో గంతులు వేస్తారు.

ఈ రకపు ప్రజలు పడే తృప్తి నిజంగా మెచ్చుకోదగ్గదే గాని ఒకప్పుడు అదీ తెలివి తక్కువగా బీద అరుపుగా వుంటుంది. ఉపమానాలు, ఉదాహరణలు చాలా కనిపిస్తాయి. కొన్నిటిని పరిశీలిద్దాం. మొన్న ఒక సంగీత ప్రియుడు పాట కచేరీకి వెళ్ళి తిరిగి వస్తూ-'ఈపాటేమిటిగాని, మొన్న మద్రాసులో సుబ్బలక్ష్మి పాడింది అదీ పాటంటే-అయినా ఆ ఛాయలున్నాయిలెండి ఇందులో కొన్ని' అని తృప్తి పడ్డాడు.

మా మల్లినాథ సూరిగారు, ఒకటిరెండుసార్లు మఠ్వస్వాముల ఇంట్లో పులిహోరా, ఊరుపిండి రుచి చూశారుట. ఇక ఎక్కడ పులిహోర చేతికందినా దాన్ని పూర్తిగా స్వీకరించి, చివరకు మెల్లగా చప్పరిస్తూ-ఇదేమిటి లెండి, 'అది' తినాలి, ఆత్మ మేల్కొవాలి. 'తృప్తాస్తు' అంటూ నిద్రపోవాలి-అనేవారు ఏదైనా పెళ్ళికి వెడతామా కొందరు అయిదు రోజులు చక్కగా మెక్కి తిరిగి వచ్చేటప్పుడు "ఆ! ఇదేంపెళ్ళిగాని, మొన్న బెజవాడలో మావాళ్ళు చేశారు పెళ్ళి-అబ్బా! అదీ పెళ్ళంటే పెళ్ళి....అయిదు రోజులూ ఎడా తెరిపిలేదు పిండివంటలకు-భోజనాలకూ. అసలు ఆ పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ ఎంత అందంగా వున్నారు" అంటూ వ్యాఖ్యానించడం, పెళ్ళి చేసినవారు విని ఉసూరు మనడం సంభవిచడం కద్దు

అసలీ 'ఇది'ని 'అది'గా భావించుకోవడమనేది కవులలో ముఖ్యంగా భావ కవులలో ఎక్కువ కనిపిస్తోంది. లేకపోతే కవులు ఏపరుగెత్తే లేడికళ్ళనో చూచివచ్చి-ఇంట్లో చీకిరికళ్ళతో, చింపిగుడ్డలతో కూర్చునివున్న ఇల్లాలిని చూచి, 'నీ చూపులు చూచి లేళ్ళు సిగ్గుపడి వెదురుపొదలకు అడ్డంపడి పారిపోతున్నట్టు' అని వర్ణించడమేమిటి!

వీరు ఒక స్వప్నసుందరిని సృష్టించుకొని అహరహం 'ఆమె నా ప్రియురాలు' అని ఆరాధించుతూ ఆమె ఎప్పుడో ఉట్టిమీదనుంచి పిల్లిదుమికి నట్లు దుమికి వాళ్ళో పడుతుందని ఆశపడి-తీరా ఆమె దర్శనం కాకపోతే భార్యను పిలిచి 'ఆ స్వప్నసుందరి నాకు వరమిచ్చింది తన అందాలన్నీ నీలో తొంగిచూస్తాయని చెప్పింది-'ఈ సుందరి' 'ఆ సుందరే'నసుకోమంది-చూడు ఆమె చెక్కిట గులాబులు నీ చెక్కిట 'తురాయి'గా తొంగిచూస్తున్నాయి-అని ఏవో బీదభావాల్ని మనస్సులో చేదుకుంటాడు.

కొందరు తమ పూరిగుడిసెలో కూర్చొని 'నా ఇల్లు నాకు రాజభవనం-నా పాత కుర్చే నా సింహాసనం' అని మీసాలు మెలివేస్తూవుంటారు. యుద్ధం వచ్చిన తర్వాత చాలావస్తువులు కరవైపోవడంవల్ల దొరికిన 'ఇది'నే దొరకని 'అది'గాభావించి వాడుకోవడం ప్రజలకు అలవాటైపోయింది. రేషనింగ్ వాడిచ్చిన-పాడు బియ్యాన్నే బంగారు తీగలుగా భావించుకొని, వెండికంచాలలో వడ్డించుకొని ఆరగించడంలా!

సిగరెట్లు పీల్చేవారు 'వారు మామూలుగా పీల్చే రకాలు దొరక్కపోతే-ఏ బండి తోలే అబ్బాయిదగ్గరో చూచి "దసరా" సిగరెట్లు ఒకటి శాంపుల్‌గా పీల్చి అదే 'నా పాలిటి నావికట్' అని గొణుక్కొంటున్నారు. మా బంధువుల్లో ఒకాయన వున్నాడు-తనకు తల్లి అంటే అతి ప్రేమ అని తెలియచేయడానికి తాపత్రయ పడుతూ వుంటాడు. అందుకని ఎవరైనా వారింటికి వెళ్ళినపుడు ఆయన ఆమె కాళ్ళమీదపడి-'ఈమె నా మాతృదేవత। నా పాలిటి అనిబిసెంట్-మదర్' అని దండకం ప్రారంభిస్తాడు.

అన్నట్టు మా యింటి దగ్గరలో వున్న ఒక మేష్టారు భార్య ఏదైనా ఫలహారం చేసిపెట్టినపుడు-"నీ ముగంలో, సావిత్రి, సీత, దమయంతి మొదలైన పతివ్రతలంతా గిర్రున తిరుగుతూ చెమ్మచెక్కలాడుతున్నారు" అంటాడు. ఏమీ చేసిపెట్టనినాడు-"నీ ముఖంలో దయ్యాలు ఊరేగుతున్నాయేం ఇవ్వాళ" అని తిట్టిపోస్తాడు.

(1946 మార్చి 13)

# 17. సిగరెట్లు

ఈ సిగరెట్లు అనేవి ఎక్కడ, ఏవేళ, ఎలా జననమైనాయో తెలియదుగాని-విశ్వమంతా వ్యాపించినాయి. ఈనాడు - నూటికి యాభై మందికి పైగా ఏ వ్యక్తిని చూచినా ఒక చిన్నరకపు ఇంజను అయిపోయినాడు. చుట్టపొగనో, సిగరెట్టునో వదులుతూ - పైగా ఈ సిగరెట్లు నాగరకతా లక్షణంగాకూడా భావించబడుతున్నాయి ఎదుటి వ్యక్తిని గౌరవించే పరికరాలుగా యెంచబడుతున్నాయి.

ఈ సిగరెట్లకు, కాల్చే వ్యక్తికి ఏర్పడే సంబంధం ప్రేయసికీ, ప్రియునికీవున్న బాంధవ్యాన్నికూడా మించింది. ప్రేయసితో కాలాన్ని అనుసరించి, కళా కళలు మార్చుకొంటూ వ్యవహరించడం కద్దు. ఆమెను విడిచి, వేరయి కొంతకాలం జీవించడం కూడా కద్దు కాని సిగరెట్టుకు అలవాటుపడిన వ్యక్తి జీవితం అది లేనిదే అస్తమించినట్లే కనిపిస్తుంది. నిద్రపోతుంటే పక్కమీద వుండాలి సిగరెట్టు-ప్రయాణం చేస్తుంటే దగ్గరవుండాలి. ఆఫీసుకుపోయినా అది నోట్లో నవ్వుతూ కనిపించాలి. ఈ యుద్ధసమయంలో సిగరెట్ల వెల ఎక్కువై అవి దొరకడం దుర్లభమైనది అందరికీ। అందువల్ల వాటి విరహం పడలేక ఫ్రాన్సులోకాబోలు ఒకవ్యక్తి తన భార్యను పది రొట్టెలకు నాలుగు సిగరెట్టుపెట్టెలకు అమ్మివేశాడుట.

ఈ సిగరెట్లు బయటకు కొనడానికి నష్టంగా, కాల్చడం చూచేవారికి కష్టంగా కనుపించినా - నిజానికి వీటివల్ల విశేషప్రయోజనం కలుగుతున్నది లోకానికి - కథలు, కావ్యాలు, ఆఫీసుపనులు వగైరాలన్నీ ఈ రోజుల్లో సవ్యంగా జరుగుతున్నాయంటే అదంతా ఈ సిగరెట్ల కృషియే అనిపిస్తుంది. డాక్టరు చూడండి ఎవరైనా కాస్త చెయ్యి చూడమనో, పరీక్ష చేయమనో వెడితే 'వెయిట్' అని ఒక సిగరెట్టు ముట్టిస్తాడు

ఏ ఆఫీసరునైనా కాస్త కాగితంమీద సంతకం చేయమంటే - కలం తీసేముందు ఒక్క సిగరెట్టు పీల్చి గుప్పున పొగ పైకి ఊది అప్పుడు దస్కత్‌చేస్తాడు - మొన్న ఒక పెద్దమనిషి 'మా పత్రికకు కథలేమైనా వ్రాయండి' అని అడిగితే దానికి పది పెట్టెల సిగరెట్లవుతాయి, ఆ ఖర్చు మీరు భరించండి అలాగే వ్రాస్తానన్నాడు.

మరి నిజానికి సిగరెట్లు అనేవి ఒకసారి అదృశ్యమైతే, లోకంలో ఎంత సంచలనం, చైతన్యం సమసిపోతుంది? నూతన కావ్యజగత్ అలా నిలచిపోతుందికూడా!—

సిగరెట్లు కాల్చడం అలవాటున్న వ్యక్తి తన ఇంటి నెలసరి లెక్కలు తయారు చేసుకొనేటప్పుడు, పప్పుకూ, ఉప్పుకూ, పిల్లల పాలడబ్బాలకుకూడా ముందు తన సిగరెట్లకో అయిదో, పదో తీసి అవతల పెడతాడు. భార్య పాపం, చిరిగిన చీరెంతో కాలక్షేపం చేస్తూ 'ఏమండీ ఈ నెలలోనైనా—' అంటే 'ఎక్కడిదే డబ్బు, కానీలేకుండా చచ్చిపోతుంటే, చూస్తూనే వున్నావుగా' అని ఉరిమి ఆమె నోరు మూయిస్తాడు - ఇప్పటికీ సిగరెట్లు కాల్చే వ్యక్తిని చూచి పెద్దవాళ్లు 'ఛీ, ఛీ ఆయన తెగసిగరెట్లు కాలుస్తాడు, పరువూ మర్యాదా లేదు' అని తేలిగ్గా మాట్లాడుతారు. 'ఓహో, చాలాదాకా వచ్చిందిటే సీనయ్య వ్యవహారం, మొన్నటిదాకా బాగానేవున్నాడు. ఈ యిల్లు మారిన తరువాత సిగరెట్లకు అలవాటు పడ్డాడట?' అని చెప్పుకోవడంకూడా కద్దు మే మెరిగిన ఒకామె అన్నది - మావారికి సిగరెట్టుమీదగల వ్యామోహం, ప్రేమలో పదోవంతు నాపైనవుంటే బ్రతికిపోయేదాన్ని అని.

ప్రతిరోజు సిగరెట్లకుగాను లోకం ఎంత ఖర్చుపెడుతున్నదీ తెలియదుగాని, ఈ సిగరెట్లను అన్నిటినీ ఒక్కచోట వెలిగిస్తే పదివేల బాంబులు పగిలినంత పొగ వస్తుందని - వీటి కొడి అంతా రాలిస్తే ఒక పట్టణం తగులబడినంత భస్మం ఏర్పడుతుందని వ్రాశారిటీవల - అంతేనేకాదు - ఒకరోజున ప్రపంచమంతటా ఖర్చుపడే సిగరెట్లతో ఇంగ్లీషుచానలుమీద ఎదురుబొదురు మోటార్లు తప్పుకొనేటంత వెడల్పుతో వంతెన కట్టవచ్చునట. అలాకాకుండా ఒకసిగరెట్టు తరువాత ఒకటిగా పేర్చుకొనిపోతే ఫ్రాన్సు రాజధాని పారిస్‌నుంచి అమెరికా రాజధాని న్యూయార్కు నగరంవరకూ సరిపోతవట.

సిగరెట్లు కాల్చేవాడి మాట అలావుంచి, అలాటి భర్తలతో కాపురంచేసే భార్యవిషయం చాలా జాలివేస్తుంది - కొన్నాళ్ళు ఇంటికి పోయేటప్పుడు, ఒక కిళ్ళీ నమిలి వెళ్ళడం అలవాటు చేస్తారు వీళ్లు. తరువాత ఆ ఖర్చుకూడా ఎక్కడ పెడతామని అదీ మానేస్తారు. దానితో భార్య ఎంత ముసలిదైనా, సిగ్గుపడుతున్నా పడుచుపిల్లలాగా కొంచెం దూరంగావుండి తల వంచుకొని మాట్లాడుతూ వుంటుంది సాధ్యమైనంతవరకూ! రానురాను ఆయనకా పొగకంపే తాంబూలమై, ఆవిడకదే అగరుధూపమై పరిఢవిల్లుతుంది

# 18. కూరలు - సామెతలు

కూరలపేర్లు మన వాఙ్మయంలోకి ఉపమానాలుగా, సామెతలుగా ఎలా వ్యాపించినవో చూద్దాం—కూరలు అంటే బ్రాహ్మణుల కూరలు వేరు-ఇతరుల కూరలు వేరు. కాని ఆచారాల ననుసరించి అన్నిటివ్యాప్తీ గమనిద్దాం.

అత్తగారు తన కోడల్ని గురించి చెప్పదలచినప్పుడు, ఆమె జోలికి పోవడం కష్టం- దురదలాగా వదలదని చెప్పడంకోసం, టూకీగా అనేస్తుంది-'అది కత్తిపీటకు కూడా దురదపెట్టే కందదుంపండీ, దానిజోలికి పోవడమెలా'అని. పల్లెటూళ్ళలో అంటూవుంటారు. ఎవరైనా చక్కని పడుచుపిల్లను చూచినప్పుడు-దానికేరా, అది తీయ చిలగడదుంపరా, కరకర నములవచ్చు కారం ఉప్పూ లేకుండానే! అని. మనవాళ్ళల్లో ఎవరైనా తెలియకుండా ఒక్కసారి లావు అయినప్పుడు అంటూ వుంటాం-'ఊరికే వున్నట్టేవుండి ఉర్లగడ్డల్లే ఊరిపోయాడేరా వీడు'అని.

అందం, ఆరోగ్యం లేకుండా ఏదో ఇదిగా పెరిగిన వారిని గురించి చెప్పేటప్పుడు—''ఆ లావును గురించి ఏమీ ఆలోచించక్కరలేదురా—వట్టి గుంగ్రచామదుంప" అనడంకూడా మామూలే. ఆ అన్నట్టు మా బంధువులలో ఒకాయనకు చామదుంప అనిపేరు. బంధుకోటి యావత్తూ అదే పేరుతో పిలవడం ఆచారం. అయితే ఆయన ఉద్యోగంలోకి పోయిన తర్వాత, ఆఫీసర్లు వగైరాలకు చామదుంప అనడం నోరు తిరక్క—ఎగ్ (కోడిగ్రుడ్డు) అని ఇంగ్లీషులో పిలవడం ప్రారంభించారు ముద్దుగా—

ధైర్యం అనేది లేక, ఏ పని చేయబోయినా జంకి వెనుకకు తిరిగి పారిపోయే వ్యక్తుల్ని చూచి మనవాళ్ళు—''వట్టి పప్పురా వాడు! చూడు ఎలా మెల్లగా జారిపోతున్నాడో-గరిటెలోనుంచి జారినట్లు" అంటారు—చక్కని సిరీ, సంపదా, అందం, చందం వున్న సంసారాన్ని చూచినప్పుడు అంటారు మనవాళ్ళు-'వాళ్ళ సంసారం చూడరా దోసతోటలాగా ఎంత చక్కగా వున్నదో సిరితో తులతూగుతూ' అని. కష్టసుఖాలకువోర్చి అలాగే మళ్ళీ తల ఎత్తుతూ, నవ్వుతూ సంసారం సాగించే ఇల్లాండ్రను చూచినప్పుడు 'పాపం ఆమెను చూస్తే ఆశ్చర్యం వేస్తుందమ్మా, కొయ్యతోటకూర దుబ్బులాగా ఎంత గిల్లినా, మళ్ళీ అలాగే చిగిర్చి చిందులు తొక్కుతుంది' అని. సుకుమారం గల వ్యక్తుల్ని గురించి చెప్పేటప్పుడు—''ఆ అమ్మాయా? అబ్బే వట్టి తోటకూరకాడ—ఇట్టే వాడిపోతుంది, కొంచెం శ్రమతగిలితే చాలును" అంటారు.

అసలే పెళ్ళికాక నానా అవస్థాపడుతూవుంటే బ్రహ్మచారులను పట్టుకొని—'వీడు వట్టి ముదురు బెండకాయరా' అని ఏడిపిస్తూ వుంటారు చూడలేదు? పాపం నేనెరిగున్న బ్రహ్మచారి ఒకాయన బెండకాయలు కొనడు. తినడు. ఎవరింటికైనా వచ్చి

నప్పుడు, ఇది లేత బెండకాయలకూర కొంచెం రుచి చూడమన్నా ఆయన ముట్టడు పాపం. పైగా బజారులో అమ్మే బెండకాయలను చూచినా, దొడ్లల్లో కాసే బెండ మొక్కల్ని చూచినా ఈయన కడవెడు నీళ్ళు గ్రుమ్మరిస్తాడు. తన స్థితికి తాను విచార పడుతూ।

ఏదో తన తప్పుకు తాను ఉలిక్కిపడి, హృదయాన్ని తడుముకొనేవాళ్ళను గురించి 'గుమ్మడికాయల దొంగరా।" అనే సామెత వున్నదికదా। అన్నట్టు మనలో ఇంకో సామెతకూడా వున్నదికాదూ?—ఎన్ని కబురులైనా చెప్పవచ్చును గాని సొమ్ము దగ్గరమాత్రం బంధుత్వం వద్దనేదానికి—'ఎక్కడైనా బావగాని వంగతోటదగ్గిర మాత్రం కాదు' అని. మావూళ్ళో ఒక వంటకాపు వుండేవాడు. ఆయన చాలా సరసుడు—పడుచు పిల్లలతో హాస్యాలాడుతూ పనిపాటలు చేయించేవాడు. "గట్టుమీద సుబ్బమ్మ కోడలుతో మాట్లాడితే కక్కాముక్కా (మాంసముకూర) వేసుకొని కంచెడు అన్నంతిన్నట్టుం దండీ" అంటూవుండేవాడు—అందాకా ఎందుకు ఏ పిల్లయినా పని చేయకుండా పక పకలాడుతూవుంటే—ఆయననేవాడు 'చేనంతా అలా చేదుబెత్తులు జల్లుతావేమే నవ్వు లతో? ఇంటికి తీసుకుపోయి దాకలో గ్రుమ్మరించు' అనేవాడు. చేదుబెత్తులంటే వెండిరూపాయలలాగా తళతళ మెరుస్తూ గంతులువేసే చాపలు. మరి ఈయన పలు కుల్లో ఎంత కవిత్వం వున్నదో గమనించండి—

మేము చదువుకొంటున్న రోజుల్లో ఒక అబ్బాయి వుండేవాడు. అతడు రోజూ వచ్చి బల్లమీద తలపెట్టి హాయిగా నిద్రపోయేవాడు—ఏరా అలా పడుకున్నావు అంటే 'ఇవ్వాళ మా ఇంట్లో వంకాయ మాంసము కూరా, ఇప్పుడే తినివచ్చాను, అరగలేదు' అనేవాడు. వాడికి కొద్ది రోజుల్లో హాజరు పట్టికలో తప్ప 'వంకాయమాంసం' అనే పేరే సర్వత్రా వ్యాపించిపోయింది.

ఎవరినైనా గూర్చి గొప్పగా చెప్పుకోడమేగాని, అతనిలో అంతశక్తి లేదని అనడానికి—"అదంతా వట్టి నేతిబీరకాయ బాపతు తెలిసిందా?" అంతకన్నా వేరేమీలేదు—అనేది సామాన్యమైన సామెతేకదా? పిల్లను కన్న తర్వాత చిక్కిన పడుచును చూచి అవ్వలంటారు—'ఒక్కకానుపుకే అది అలా వంగ వారుగు అయిపోయిందేమే?' అని.

కూరలనేవి ఆహారంలోనే కాకుండా జాతీయ భాషా జీవనంలోకూడా కమ్మని భావాలనందించి వాటి రుచులను చెప్పుకొంటున్నాయి. (1945 ఆగష్టు 25)

# 19. "ఇది నాది కాదనుకో"

ఇళ్ళల్లో రోగాలో, రొష్టో వచ్చినప్పుడు – మనసు విసుగులోపడి 'ఈ సంసారాన్ని వదిలిపోతే బాగుండును' – అనే విరక్తిభావం వస్తోంది చాలామందికి. కాని అది ఎంతసేపు నిలుస్తుంది. బండితోలే సాహేబ్ కిరాయిరాగానే నోట్లోవున్న బీడీతీసి

దూరంగా పారేసి - గర్రిం తినే గడ్డితీసి జంపఖానాక్రింద కుక్కి, దాని మూతికి కళ్లెం తగిలించి, 'ఎక్కండి సార్! నిముషంలో వెళ్ళిపోదాం' అని లేనిపోని బలాన్ని, సంతోషాన్ని తెచ్చుకొన్నట్లు—

ఇంట్లో భార్య ఆరోగ్యం కొంచెం తేరుకోవడమో, తన మనస్సు మారడమో, సంభవించినప్పుడు మళ్ళీ సంసారపు జీను తగిలించుకుని ఒక్క పరుగు తీస్తూనే వుంటాడు గృహస్థు - దానిలో తాత్కాలికంగా కనిపించే ఆనందాన్నే పండుగక్రింద భావించుకొని, ఆ విరక్తే నిజానికి మరికొంచెంసేపు నిలిస్తే - అందరూ తత్త్వవేత్తలూ, వేదాంతులు, ఇంకా దేవుడు మేలుచేస్తే స్వాములవార్లు అయిపోతారు.

అలా విరక్తి నిలవకపోవడంవల్ల ప్రపంచం నిలిచిందిగాని లేకపోతే దేశంలో వుండే 'ఉప్పురంగు' చాలేదా, మిల్లుబట్టలు చాలేవా ఆ స్వాములవార్లకు! కుంపటిలో ఉప్పురాయి పడ్డట్టు చిటపటలాడే ఈ కోపాలవల్లా కొంత లాభమే! కొంచెంసేపైనా ఇల్లువదలి అవతలికి పోతారు. ఈలోగా ఇల్లాలు నిశ్శబ్దంగా వంట చేసుకోవచ్చు - తలదువ్వి నీళ్ళు పోసుకోవచ్చు - లాంతరు తుడిచి నూనె పోసుకోవచ్చు — అప్పటికి ఆయన రానేవస్తారు — చప్పుడు చేయకుండా!.... ఇలాటి భావం, ధీమా స్త్రీలో వుండడం మంచిది.... ఆయనగారి తాత్కాలిక కోపానికి తల్లక్రిందులైపోకుండా!

ఇలా కోపంవచ్చి ఇల్లు వదిలివెళ్ళే విసుళ్ళలో భేదంవుంది. కొందరికీ కోపం కొన్ని గంటలే వుంటుంది. కొందరికి రోజులు, కొందరికి నెలలు. ఈ తరగతులవారి కోపాలు వారి భార్యల అదృష్టాన్నిబట్టి వుంటాయి. భర్త రెండునెలలదాకా ఎక్కడికో పోయి కూర్చున్నాడంటే ఆ ఇల్లాలికి వేసవికాలం శెలవు లిచ్చినట్లుగా వుంటుంది. పోయినవారుపోక ఏ ఇరవై రోజులకో చక్కావస్తాడనుకోండి-క్రిష్టమస్ సెలవులలాగా గిర్రున తిరిగి వచ్చినట్లుంటుందా ఇల్లాలి ప్రాణానికి. సరే ఒకటి, రెండు రోజులు దూరంగావుండి ఏదో బడాయి నిలబెట్టుకోచూచేవాళ్ళుంటారు. వాళ్ళ ఇల్లాళ్ళకా రెండు రోజులు శని, ఆదివారాలలాగా వుంటాయి.

మొన్న మా మల్లినాథసూరిగారు ఇలాటి విరక్తిలోనేపడి ఒక వేదాంతోపన్యాసానికి వెళ్ళారు. సూక్ష్మంలో వేదాంతం బోధించదలచి ఆ ఉపన్యాసకులు ఇలా చెప్పారట, "మీరు ఏది అనుభవించబోతున్నా అది మీదికాదని చెప్పుకోండి — ఒకసారి మనస్సులో. ఇంట్లోకి వెళ్ళేముందు 'ఈ ఇల్లు నాదికాదు' అని లోపలకు అడుగు పెట్టండి" అని ఆయన ఉదాహరణ చెప్పారట.

ఇది బాగా నచ్చింది మల్లినాథులకు. మరో ఆయన ఉపన్యాసం విని బయటికి వచ్చి సైకిల్ ఎక్కుతున్నాడట. మల్లినాథులు ఆయన్ని ఆపి....'మీరు సైకిల్ ఎక్కుతున్నారుగదా మరి! — ఇది నాది కాదనుకునే ఎక్కుతున్నారా?' అని ప్రశ్నించారట. ఆ వ్యక్తి అంతమాట అనలేక వెళ్ళిపోయాడట.

మల్లినాథులు యింటికివెళ్ళి తలుపుకొట్టి తీసేదాకా 'ఇది నా యిల్లుకాదు' అని

గొణుక్కొంటూ నిలబడ్డారట. భార్య తలుపుతీసి 'ఏమిటండీ! గొణుగుతున్నారు?' అంటే – 'ఈ ఇల్లు నాదికాదు....నువ్వు నాదానివికాదు, ఈ కాళ్ళు కడుక్కోబోయే చెంబు నాదికాదు' అన్నారుట మెల్లగా. ఆమె ఆశ్చర్యపడి 'కొంచెం తెలిసేలాగా బిగ్గరగా చెప్పండి – అర్థంకావడంలేదు' అన్నదిట. 'స్వాములవారు ఇలా అనుకో మన్నారే – నువ్వు నాదానవు కాదని బిగ్గరగా అంటే, నువ్వు అనుమానపడకపోయినా అంతా విని అల్లరిచేస్తారని భయం. 'ఇల్లు నాదికాదని బిగ్గరగా అంటే కాపురాలున్న వాళ్లు అద్దెఎగేసి పోతారేమోనని భయం' అని ఆమెను మెల్లగా లోపలకు తీసుకు పోయారుట.

వేదాంతంలో పడటమంటే జ్ఞాపకం వచ్చింది. ఒక పెద్దమనిషి భార్యని పిలిచి అన్నాడుట – 'ఏమేవ్! నేను కొద్దిరోజుల్లో సన్యాసం పుచ్చుకోబోతున్నాను' అని. అంతలో ఆమె కుమిలికుమిలి ఏడ్వడం ప్రారంభించిందిట. భర్తకు జాలివేసి ఆమె కన్నీళ్ళు తన కొల్లాయితో తుడిచి, 'ఎందుకలా ఏడుస్తావప్పుడే? నేను సన్యాసంలో కలుస్తానన్నాననా?' అన్నాడుట. ఆమె దుఃఖం ఆపుకొని 'మాట అయితే అన్నారుగాని ఆ మాటమీద నిలుస్తారోలేదోనని ఏడుపు వచ్చింది నాకు' అన్నదట.

ఈమధ్య ఈవూళ్ళో ఒకాయనకు సంసారంలో కొంత చికాకు ఏర్పడి కొంత కాలం విశ్రాంతిగా కాలం గడపాలనుకొని, మామగారికి ఉత్తరం వ్రాశాడుట – 'మీ అమ్మాయి కొంతకాలం మీతో కలసి వుండాలనుకొంటోంది' అని.

మూడోరోజు ఉదయం ఇంటికి వెళ్ళేటప్పటికి, అత్తగారూ, మామగారూ పిల్లలు ఇంట్లోదిగి ఎంతో ఘనకార్యం చేసినవాళ్ళలాగా కబుర్లు చెప్పుతున్నారుట. ఆయన హృదయ సంక్షోభం గ్రహించండి....ఆ తరుణంలోనే ఆయన వూళ్ళోవున్న ఒక స్వామీజీ దగ్గరికి పరుగెత్తి – 'ఏమిటి తరుణోపాయం!' అని అడిగాడుట. స్వాములవారు 'అయితే రేపు మీ ఇంట్లో నాకు భిక్ష ఏర్పాటుచేయించు వారు కదిలే తంతు నేచేస్తాను' – అన్నారట. ఆ గృహస్థు గుండెలు కొండలంత బరువై మెల్లగా ఇల్లు చేరాడుట.

మొన్న స్వాములవారి శిష్యుడు ఆయన్ని కలుసుకొని – 'ఇంటికీ, ఇక్కడికీ భేదం ఏమిటి?' అని ఒక గృహస్థు ప్రశ్నించాడుట. శిష్యుడు క్షణం ఆలోచించకుండా – 'ఇంటిదగ్గిర మా ఆవిడ రెవికలు ఉతికేవాణ్ణి, ఇక్కడ వాటిస్థానంలో స్వాములవారి కాషాయాలు వుతుకుతున్నాను' అన్నాడుట.

[1946 జనవరి 10]

## 20. అనుకోని చోటుకి

హఠాత్తుగా అనుకోకుండా, ఒక పనిని నిర్దేశించి, ఒక చోటును నిశ్చయించి మరో పనిలో పడటం, మరోచోటు చేరడం సామాన్యంగా జరుగుతూ వుంటుంది.

అలా చేయడం, చేరడం మన ఉద్దేశ్యం కాకపోయినా దాని ఫలితాలు, అనుభవంలోకి తీసుకోక తప్పదు.

వెనుకటికి ఒకాయన ఎవరో పచ్చగా కాపురం చేస్తున్నవారి ఇంటితలుపు కొట్టాడట-అర్ధరాత్రివేళ. తలుపుతీస్తే లోపలికిపోయి-ఏమైనా సరే, అయిదుకన్న ఎక్కువ ఇవ్వను మీ యిష్టం అంటున్నాడట-పాపం....ఆ ఇంట్లోవాళ్ళు ఆయన పిచ్చివాడను కొని-అయిదురూపాయలేమిటయ్యా అంటే-'అంతే, ఎక్కువ ఇవ్వనూ ఇవ్వను, అసలు లేనూలేదు' అంటూ కూర్చున్నాడట. గట్టిగా ఇంటివాళ్లు కేకలువేస్తే మీదా ఈ ఇల్లు, భోగంవాళ్లందేవారే వెనుక ఈ ఇంట్లోనంటూ బయటికి పోబోతే-ఆ యజమాని జుట్టు పట్టుకొని వెనక్కులాగి దవడలు వాయించి-జేబులోని అయిదు రూపాయలుకూడా లాక్కుని మరీ పంపాడట బయటకు.

అందాకా ఎందుకు-ఒకసారి మా మల్లినాధ సూరిగారు టైం అయిన తరువాత దబదబా రైలుకి వెళ్ళి టిక్కెట్టుకొని లోపలికి వెళ్ళేటప్పటికి రైలు కదిలిందట-పెట్టె వంక చూడకుండా తలుపుతీసి ఎక్కేపరికి, తీరా అది ఆడవాళ్ళ పెట్టె అయిందట, ఇక దిగటానికి వీల్లేక-"పోనీలే"మని అందులోనే నిలుచున్నారట. అందులోవున్న ఆడవాళ్లు కొందరు నవ్వుకోవడం, కొందరు విసుక్కోవడం, కొందరు క్రోధం తెచ్చు కోవడం ప్రారంభించారటం. అదిచూచి మల్లినాధులు-'ఫరవాలేదులే అమ్మా! ఫరవా లేదు లెండి! పైస్టేషనులో దిగిపోతాను' అని నచ్చచెప్పడం ప్రారంభించారట. మల్లి నాధులు గాబరా పడటం చూచి ఒకావిడ పోనీ ఈ చీరకప్పుకోండి పై స్టేషను దాకా నని మీద గిరవాటువేసింది. కాని ఆయన అంతపని చేయడానికి భయపడి-చీర అంచులోవుండే-చాకలివాడి నెంబరో పేరో, చూచి, ఇచ్చేశారట తిరిగి. ఈయన ఆడ వాళ్ళ పెట్టెలో ఎక్కడం చూచి గార్డు పరిగెత్తుకువచ్చి వాడూ అందులోనే ఎక్కి-మల్లినాధుల్ని ఇందులో కెందుకెక్కావయ్యా, నిన్ను పోలీసులకు అప్పగిస్తాను-అన్నాడట. మరి నువ్వెందుకు ఎక్కావయ్యా ఇంత రూల్సు తెలిసినవాడివని తగాదా ప్రారంభించాడట-'నిన్ను దింపటానికంటాడు గార్డు'. 'నేను పైస్టేషనులో ఎలాగు దిగు తానుగా! ఇందులో నువ్వెందుకెక్కాలి-అసలు ఆడవాళ్ళపెట్టె ప్రక్క నీపెట్టె తగి లించుకోవడం శుద్ధ తప్పు' అంటుండగా-ఒకావిడ ఇద్దరు పిల్లల్ని తీసుకువచ్చి 'మీ కేకలకు వీళ్ల నిద్రలేచారు-చెరొకర్ని ఎత్తుకొని ఆడించండి, ఎక్కితే ఎక్కారు' అని అప్పగించిందట. అప్పుడే రైలులో అమ్మే కుర్రవాడిదగ్గర గార్డు కాజేసిన బిస్కట్లు ఆకుర్రవాడికి పెట్టి సముదాయించాడట-మల్లినాధులు ఆ గార్డుదగ్గిరే రెండు బిస్కట్లు బదులడిగి పుచ్చుకొని, ఒకటి తాను తిని, ఒకటి పిల్లవానికి పెట్టి ఆడిస్తుండగా ప్రక్క స్టేషను వచ్చింది-గబగబా మల్లినాథులు, గార్డూ ఆపెట్టెలోనుంచి దిగిపోతూంటే-ఆ పిల్లలు 'వాళ్ళని దిగవద్దనే అమ్మా, ఇక్కడేవుండి బిస్కట్లుపెట్టమనవేవ్' అని ఏడవడం ఎక్కువచేశారట. పెట్టెలో వాళ్ళంతా నవ్వుతుంటే గార్డూ, మల్లినాధులూ ఒకరి మొగం ఒకరుచూచుకొని వెళ్ళిపోయారట.

వెనుకటికి మాగ్డొనాల్డు బ్రిటిష్ ప్రధానిగా వున్నప్పుడు—ఒకసారి కారులో ఎక్కడ నుంచో వస్తున్నాడట. అర్ధరాత్రి అయింది. ఇంతలో కారు చెడిపోయింది. ఇక ఎక్కడికి వెళ్ళే అవకాశంలేక ఎదురుగావున్న ఇంట్లోకి పోయి, ఆ రోజు గడి పేద్దామనుకొన్నాడట తీరావెడితే అది పిచ్చి ఆస్పత్రి అయింది. అక్కడివాళ్ళు నీ వెవరని అడిగితే 'నేను బ్రిటిష్ ప్రధానిని మాగ్డొనాల్డును' అన్నాడట. సామాన్యంగా అక్కడకు వెళ్ళిపిచ్చివాళ్ళను నీవెవరని అడిగితే మాగ్డొనాల్డు ప్రధానిననో బ్రిటిష్ చక్రవర్తిననో చెప్పడం అలవాటట—సరే ఇతడు అలాటి పిచ్చివాడేనని వెంటనే పట్టి ఒక గదిలో పారేశారట. అతడు నేను పిచ్చివాణ్ణి కాదని గోలచేసినా ఆ అధికారుల అభిప్రాయం బలమైందేగాని, ఏమాత్రం నిజం గ్రహించుకోలేదు. ఆరాత్రల్లా మాగ్డొనాల్డు ఆ పిచ్చి ఆస్పత్రిగదిలో పడివుండక తప్పలేదు. తెల్లవారి ప్రధానికోసం ఎవరో వెతుక్కొంటూవచ్చి తప్పించారట.

ఈ సందర్భంలో ఒక కథ జ్ఞాపకం వస్తోంది. వెనుకటికి యూరపు దేశంలో ఒకరాజు మారువేషం ధరించి దేశంలో తిరగడం ప్రారంభించాడట—ఒకనాడు సైనిక కేంద్రాల వైపున ఒక పిచ్చి రూపంలో తిరుగుతున్నాడు. సైనికులతణ్ణి అనుమానించి పట్టుకొన్నారట. అప్పుడతడు ఇక చెప్పక తప్పదని నిజం చెప్పేశాడు—నేను మీ దేశపు రాజునని—అదివిని ఒక సైనికుడు "నేను ఆరాజు అమ్మ మొగుణ్ణిలే. మాట్లాడకుండా కూర్చో"మని పట్టి ఒక గదిలో పెట్టాడట. (1646 జూన్ 29)

# 21. అధిక ధరలు

[ఈ నాడు ఆసేతు శీతనగపర్యంతం 'అధికధరల' సమస్య అతి తీవ్రరూపం దాల్చి ప్రజాజీవనాన్ని పంచ బంగాళం చేస్తుంది. ఈ సమస్య ఈనాటిది కాదు. ఎప్పుడో తల ఎత్తి ఈ నాటికి విశ్వరూపం దాల్చింది. 1950 లో వ్రాసిన ఈ వ్యాసం గమనించండి. అప్పుడే గుండెలెలా తల్లడిల్లాయో తెలుస్తుంది.]

ఎండలు తీవ్రరూపం దాల్చాయి. ఈ తీవ్రతను అందరం భరిస్తున్నాం. కొండ ప్రదేశాలవారు గుట్టు మిట్టాడిపోతారు. అయితే ఈ రోహిణి వెళ్ళి మృగశిర రాగానే ఏ తొలకరి జల్లులో కురుస్తాయనే ఆశకొంచెం వుంది.

కాని ఈనాటి మానవ జీవితాలలో కనిపించని ఎండలు కాస్తున్నాయి. ప్రతి నిత్యం రోహిణిగానే గడిచిపోతుంది. డిగ్రీలు కొలిచి చెప్పే అవకాశాలు లేవు ఈ వడగాడ్పులకు దవడలు వాచిపోతున్నాయి. జీవితాలు కూలిపోతున్నాయి.

అసలే సహారా ఎడారులుగావున్న సంసారాలలో ఈ గాడ్పుల భయంకరమైన ఇసుక తుపానులు లేవదీస్తున్నాయి పాంథులు దారి తెలియక తడబడిపోతున్నారు. ఏమిటీ గాడ్పులు? అంతులేకుండా పెరిగి ఆకాశాన్నంటిన బజారు ధరలు. 'అందు

కొంచె చావు-అందుకోకపోతే, చావుగా వున్న ఈ ధరలు మృగతృష్ణగా మానవుణ్ణి పరిగెత్తిస్తున్నాయి. బ్రతుకే వడగాడ్పుగా మారిపోతోంది. "ఇదీ అసలు రోహిణి. ఇదీ అసలు వేసవి", అని ఆయాసపడుతున్నారు ప్రజలు. తొలకరి ఎంతదూరమో ఎలా చెప్పడం?

తగినన్ని పంటలు పండించడానికి, ఈ ఎండలు తగ్గించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. కనుక తొలకరి త్వరలోనే రావచ్చుననే విశ్వాసంతో ప్రజలు జీవిస్తున్నారు. కాని ప్రస్తుతానికి భరించడం దుర్భరంగా వుంది.

ఉదాహరణకు ఈయేడు ఊరగాయలవిషయం ఆలోచించండి. సగంపైగా కొంపలో జాడీలు కడిగిన పాపాన పోలేదు. బజారు వెళ్ళి కాయ ధర అడగడానికే భయపడి పోయిన వాళ్ళున్నారు, చాలామంది.

మామిడికాయలు వంద అయిదురూపాయలు అమ్మిన రోజుల్లోనే మిరపకాయలు రెండున్నర, నూనెరూపాయన్నరా "ఆవకాయ పెద్దఖర్చన్నూ! వందఆవకాయ, మాగాయ జాడీల్లో నింపేసరికి అప్సరసల్ని ఆహ్వానించినంత పనవుతుంది" అనుకునేవారు.

ఇప్పుడో వంద మామిడికాయలు పాతిక రూపాయలు, ముప్ఫయి రూపాయలు-కాయల్లో పులుపు పెరిగిందా! విరిగిందా! నరుల నాలుకలు మారినాయా! మామిడి కాయలు అలాగే వున్నాయి-మనుష్యులు అలాగేవున్నారు మధ్యన ఈ ధరలు మండు టెండలు కురిపిస్తున్నాయి. చెట్లకూ, జిహ్వలకూ మధ్య ధనపు పుట్టలు ఎలా పెరిగి నాయి కదిపితే బుస్సుమని కాటువేస్తున్నాయి.

ఏమమ్మా మీ యింట్లో ఆవకాయ పెళారా?' అంటే ఒకావిడ 'ఇంకాలేదండీ! నాలుగు జాడీలు నింపడమా! నాసుతాళ్లు చేయించుకోవడమా అన్నది తేలలేదు?' అన్నదట.

బియ్యం తెప్పించుకొమ్మని ఒకాయన ఇంట్లో డబ్బిచ్చి వెడితే-భార్య వాకిట్లో కొచ్చిన మామిడికాయలు కొని వేసిందిట. ఆయన రాగానే "ఏమండోయ్ కాయ లెలాగో కొన్నాను. ఇంక కారం, నూనె, ఉప్పు కొని తేవాలి. త్వరగా తెప్పించండి. జాడీలో పడేస్తాను. ఏడాదీవుండేది పచ్చడి. డబ్బుయిబ్బంది ఎప్పుడూ ఉండేదేనూ అన్నదిట.

ఆయన అంతావిని 'సరే! సరే' అంటూ ప్రక్కయింటికి వెళ్ళాడుట వాళ్ళకు గొడ్లున్నాయి. వాళ్ళనడిగి ఇంత గడ్డి పట్టుకు వచ్చాడుట. 'అదేమిటండీ గడ్డితెచ్చారు?' అని ఆశ్చర్యంగా అడిగిందిట భార్య.

'ఆ ఏంలేదు నువ్వు చెప్పిన వస్తువులన్నీ నే తెచ్చేసరికి పై సంవత్సరము మళ్ళా మామిడికాయలు వచ్చేకాలం ఎలాగూ వస్తుంది. ఈలోగా యివిపాడైపోతాయి. గడ్డితో కాపేస్తాను. పండితే బజారులో రెట్టింపుధర వస్తుంది. అంటూ వాటిని గడ్డిలో కప్పాడుట.

మా మల్లినాథసూరిగారిని "ఏమండీ! ఈ సంవత్సరం ఆవకాయ పెట్టారుటండీ? అని ప్రశ్నిస్తే ఉలిక్కిపడి "నన్నేనా అడిగేది? నిజంగా చెప్పండి. దయవుంచి ఇలాంటి ప్రశ్నలేమీ నన్ను అడక్కండి. నాహార్టు ఆగిపోతుంది. మీకేం మీరు బాగానేవుంటారు మా యింట్లో బోలెడుమంది పిల్లాజెల్లా వున్నారు. వాళ్ళకు చాలా ఇబ్బంది. హాస్యం చేస్తే చెయ్యండిగాని ఇలాంటి ప్రశ్నలు వెయ్యకండి దగ్గరలో డాక్టరుకూడా లేడు" అన్నారు.

"ఆదేమిటండీ అలా గమ్మత్తుగా మాట్లాడుతారు. అందరూ ఎలా కొనుక్కుంటు న్నారు?" అంటే "ఆ! అందరిమాటా నాకెందుకు? నాది వీక్‌హార్టు. ఇలాంటిహాస్యాలు చెయ్యకండి" అన్నారు.

"మీరు హాస్యం చేస్తున్నారు. కదిలితే హార్టు ఆగిపోవడమేమిటి?" అంటే— "నాది హాస్యమా! సీరియస్‌గా చెప్పుతున్నాను. నా దగ్గిర అలాంటి ప్రసక్తి తేవద్దు. గాంధీజీ పోయారన్న వార్తవిని కొందరు పోయారంటే నేను నమ్మలేదు. ఇప్పుడు నమ్మకం కుదిరింది. వెధవహార్టు ఏం వుందండీ! టప్‌మని ఆగిపోతుంది. అందాకా ఎందుకు? మొన్న ఇద్దరు బజారున పూరుకోలేక మామిడిపళ్ళ ధర అడిగారుట. ధర చెప్పగానే ఇద్దరూ వడదెబ్బతగిలినట్లు పడిపోయారుట. "ఈ మధ్య ఒకావిడ కడుపు తోవుండి భర్తను రెండు దానిమ్మపండ్లు తెమ్మని అడిగిందిట. ఇదిగో అని ఫష్టు తారీఖుదాకా దాటవేసి బజారుకెళ్ళి ధర అడిగినాడట. జత మూడు రూపాయలు చెప్పా డుట. అది భార్య మనస్సు తీర్చడమో దుకాణంవాడి మనస్సు తీర్చడమో తెలియక తను బాధ పడ్డాడుట. చివరకు ఆ ఫలాలుకొని భార్యకిచ్చి, తను ఆ బాకీ తీరేదాకా మధ్యాహ్నంపూట కాఫీ త్రాగటం మానేశాడుట.

"మీకు హాస్యంగా వుంటుందిగాని వీక్‌హార్టువాళ్ళు బజారుకెళ్ళి మాటాడరండి. ఒకవేళ తప్పనిసరి అయితే డాక్టర్ని వెంటపెట్టుకొని వెళ్ళాలి" అన్నారు మల్లినాథం.

ఆ భయంతోనే ఆయన కొత్తచెప్పులు కొనుక్కోవడం మానేశారుట. పంచెలు కొందామని ప్రయత్నమట కాని ధర అడిగితే ఏంప్రమాదమోనని వున్నవాటినే దొడ్లో వుతుక్కొంటున్నారుట— రాజాజీ పద్ధతిలో. ఇంతకూ ఆయన ఆవకాయ పెట్టించదలచుకోలేదట. 'రుచిగల వస్తువు కాదుటండీ! ఎలావదులుతారు? అంటే— "ప్రాణంకంటె రుచిటండీ!" అన్నారు.

చివరకు ఆయన ఒక ఉపాయం చెప్పారు—"ప్రతి ఆఫీసులోనూ అధికారుల ఊరగాయలు పెట్టించి వుంచాలి. ఆవకాయ, మాగాయ, చింతకాయ, ఉసిరికాయ వుండి తీరాలి నెలనెలా సిబ్బందికి పంచిపెట్టి వాటి ఖరీదు చివరకు బోనస్‌లోనుండి తీసుకోవాలి. ఆ విధంగా నాలుకలు కొంతవరకు బ్రతుకుతాయి" అన్నారాయన.

అనుకోకుండా బజారు ధరలన్నీ ఒక్కసారిగా ఆకాశమెత్తున పెరిగాయి. ముస్తాబులకూ మోజులకూ ఆశలు వదిలినా— ఆహారపదార్థాల్లోకూడా కరువు వచ్చి పదింది రూపాయి చేతికిస్తే రూపాయిఎత్తు వస్తువులే వస్తున్నాయి.

ఉప్పు, పంచదారకన్నా ప్రియమైంది పప్పు – బద్దలలెక్కన కొనవలసివస్తోంది. చింతపండు దొరక్క గింజలుచీకి వాపిరి తీర్చుకోవలసివస్తోంది మిరపకాయలు కుచ్చిళ్ల లెక్కన కొనడందాకా వచ్చింది. ఎక్కడచూచినా ఎగిరిపడే విస్తళ్ళు – వెండి కంచాలకన్నా విలువైనవిగా తయారయ్యాయి. కిర్సనాయిలు పన్నీరులాగా తులాల లెక్కన తూచి పోస్తున్నారు. కొబ్బరి, పప్పునూనెలు అణా ఇస్తే అరచేతి గుంటలోకి రావటంలేదు.

ధరలు అధికమైనాయి గనుక తప్పనిసరిగా అందరూ తమ అలవాట్లను మార్చుకోవలసి వస్తుంది. ప్రతి వ్యక్తిలో, ప్రతి గృహంలో ఈ మార్పు గోచరిస్తుంది. పొదుపుకోసం కాకపోయినా – పొట్టకోసం అధిక జాగ్రత్తలు వహించవలసివస్తోంది అందరూ. ఈ జాగ్రత్తలు ఎలా వ్యాపించాయో సూచించే సంభాషణ లిక్కడ కొన్నిటిని వివరిస్తాను.

'మిస్టర్ జేబులో వక్కపలుకుందా?'

'వక్కపలుకా? వీశె మూడురూపాయలు దాటింది. కావాలంటే రెండు కంది బద్దలున్నాయి పెట్టమంటే పెడతా!'

'సుబ్బారావుగారూ! అగ్గిపెట్టె ఇలా ఒకసారి పడెయ్యండి.'

'అబ్బాయ్, అగ్గిపెట్టె ఖరీదు ముక్కాని అయింది. మనకీ పెట్టె ఒకరోజు రావడంలేదు – మీ చుట్టకో పదిపుల్లలు ఎక్కడ ఇవ్వను! పైగా ప్రతివాడు అగ్గిపెట్టె తీసుకుని పుల్లలు కాజేయడం ప్రారంభించాడు'.

'ఏమండీ! మిమ్మల్నే, ఇవ్వాళ ఒక కవరు తెస్తారూ? మావాళ్ళకు ఉత్తరం వ్రాయాలి!'

'కవరా! అణన్నర పెట్టాలి. కావాలంటే ఒక కార్డు తెస్తాను. అలాగే అందులో విషయాలన్నీ ఇరికించి వ్రాసుకో.'

'ఏయ్! రేపటినుంచి ఒకపూట కాఫీ మానేద్దాం. పొద్దున మానదామా? మధ్యాహ్నం మానదామా?'

'కాఫీ అలా మానలేమండీ, పొద్దున మానితే తూలిపోతాం. మధ్యాహ్నం మానితే మాడుపోటు – ఒకపూటదే రెండుపూట్లా సద్దుకుందామండీ!'

పాలమనిషి: 'ఏమమ్మా! పాలు తక్కువ పోయించుకొంటున్నారా విన్నటినుంచి?'

గృహిణి: 'ఏం చెప్పమంటావు మాణిక్యం! బజారులో కాఫీగింజలు దొరకడంలేదు, పంచదార అంతకన్నా దొరకడంలేదు. ఎక్కువ పాలు పోయించుకొని ఏంచేద్దాం?'

భార్య : ఏవండీ . ఇదివరకు పప్పు, కూర, పచ్చడి, పులుసు వండందే ఊరుకొనేవారు కారుగదా.... ఇప్పుడు ఏదో ఒకటి చాలులెమ్మంటున్నారేం ?'

భర్త : 'చాలకేంచేస్తుంది ? జీతంలో సగంపైగా బియ్యానికే పోతుంది. తక్కినవి ఎక్కడనుంచి వస్తాయి .'

పరికాళ : 'పాలలోచనరావుగారూ ! కాసేపలా పార్కులో కూర్చుందాం వస్తారా ?'

పాల : అక్కడ సైకిల్‌కో అర్ధణా ఇవ్వాలి పరికాళరావుగారూ ! ఎందుకొచ్చినగోల.... సరాసరి ఇంటికే పోతాను'.

రామ : 'చంద్రింగారూ ! ఇవ్వాళ ఏదైనా సినిమాకు పోదామా ?'

చంద్రి : 'ఎక్కడ సినిమా రామారావుగారూ ? ఆ డబ్బుపెడితే మూడుశేర్లు ఉప్పు వస్తోంది. నెలపొడవునా సరిపోతుంది'.

భార్య : 'సబ్బు లిన్ని తెచ్చారెందుకండీ ఇవాళ ?'

భర్త : 'ఇవి సువాసన సబ్బులుకావు.... బట్టల సబ్బులు.... రేపటినుంచి స్వంతలాఁడ్రీ ! మన యింట్లో గాంధీ ఉద్యమం ప్రారంభం....'

భార్య : 'మన సంసారంలో పొదుపు మార్గాలు ఆలోచిస్తున్నారు సరే, వచ్చే చుట్టాలమాటేమిటి ?'

భర్త : 'అందుకనే రేపటినుంచి క్యారేజీ భోజనం ఎందరొచ్చినా అందులోనే....'

భార్య : 'సాయంత్రిం ఇంటికి వచ్చేటప్పుడు మల్లెపూలమాల మరచిపోరుగా !'

భర్త : 'మల్లెపూలెందుకు....దొడ్లో మంచిపత్రి వుంటే. అది వాడితే వంటికి చాలా మంచిదిట !'

భార్య : 'ఏం ! ఇవ్వాళ పనిమనిషికి అడక్కుండానే డబ్బులిస్తున్నారు ?'

భర్త : రేపటినుంచి మానిపిద్దామని.'

భార్య : 'ఏమండీ ! గడ్డం చేసుకోకుండానే వెడుతున్నారు ?'

భర్త : 'ఇంకేం గడ్డం ! బ్లేడు బేడ అయింది. కొద్దిరోజుల్లో ఆంధ్రి ఠాగూర్‌ల మైపోతున్నాం.'

[ 1942 ఆగష్టు 28 ]

*

# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం, పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతినీ, అందంగా, శక్తివంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ- ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయన శీలతనూ అలవరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని ప్రజానీకానికి అందిస్తే సాహిత్యంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ఇంతవరకూ ఇరవైవొక్కటి ప్రచురణలు ప్రచురించి లక్షయాభై వేలకు పైగా ప్రతులను తక్కువ వెలకు తెలుగు పాఠకుల కందజేయడం జరిగింది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో ఇప్పటికి దాదాపు 7,000 మంది, యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభించబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 450 మంది, భారతీభూషణులుగా 40 మంది చేరారు.

ఉడుతా భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషా ప్రియత్వం, ఇవే మా పెట్టుబడి మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.

19-7-1974

దాదాపు 7,000 సహృదయులు
సాహితీమిత్రులుగా చేరారు.

10,000

సాహితీమిత్రులకు
సన్నిహితం కావాలని మా ధ్యేయం!

సాహితీమిత్రులు, భారతీమిత్రులు, భారతీభూషణులుగా చేరి
యువభారతి సాహిత్యోద్యమ నిర్వహణలో తోడ్పడండి!



## 1974 లహరి

# ప్రతిభాలహరి

ప్రతిభాలహరికై ఎన్నికైన ప్రతిభామూర్తులు

* శ్రీనాథుడు
* తెనాలి రామకృష్ణుడు
* పానుగంటి లక్ష్మీ నరసింహారావు
* కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
* మహాకవి శ్రీశ్రీ